# గ్రామసేవ

మూలము

మహాత్మా గాంధి

అనువాదము

సింగంపల్లి వేంకటసుబ్బారావు

ప్రకాశకులు

కతాయీ మండలి, ఎల్లపల్లి.

# గ్రామ సేవ

మూలము

మహాత్మా గాంధి

అనువాదము

సంగంపల్లి వేంకట సుబ్బారావు

ప్రకాశకులు

కతాయీ మండలి, ఎర్లపల్లి.

# ఆర్షవాణి

ఆంగ్లేయులు మన భారతభూమిపై అడుగు పెట్టుటకు పూర్వము ఇచట లక్షలాది కుటీరములలో వడకుట, నేయుట నిత్యము జరుగుచుండెడివి. వ్యవసాయాదాయములో గల లోటును గ్రామస్థులీవిధముగ భర్తీచేసుకొనుచుండెడివారు. హైందవ జీవనసూత్రప్రాయమైన యీకుటీర పరిశ్రమలను నమ్మరానంత అమానుషముగను, కఠినముగను, ఆంగ్లేయులు నష్టభ్రష్టము గావించిరి. ఈ విషయమున ఆంగ్లేయుల సాక్ష్యమును గలదు. అర్ధాకలితో జీవించుచున్న ప్రజానీకము క్రమక్రమముగా మృత్యుముఖమును చేరుచున్నదను విషయమును పట్టణవాసులు సాధారణముగా నంగీకరింపరు. భారతదేశమును పీల్చి పిప్పిచేయుచున్న విదేశీ పెట్టుబడిదారుల కొంపలు నింపుటకై తాము శ్రమించి చేసిన దళారీవ్యాపార ఫలితమే తామనుభవించుచున్న తుచ్ఛ విలాస భోగములని. పాపము! పట్టణవాసుల కేమి తెలియును? విదేశీయుల లాభములును, వానికి తోడు వీరి దళారీవ్యాపారమును, — ఈ రెండును పేద భారత ప్రజానీకమును పీల్చి పిప్పి చేయుచున్నవి. బ్రిటిష్ యిండియాలో స్థాపింపబడుచున్న ప్రభుత్వము సాధారణ పేదప్రజానీకమును ఈ విధముగ పిండుటకై ఉద్దేశింపబడినది. నేటి భారతీయ గ్రామములు జీవచ్ఛవములై అస్థిపంజరములై యున్న పల్లెలు — కృత్రిమ అద్దములు ధరింపని యథార్థ నేత్రములకు తమ దీన దుర్భాగ్యస్థితిని స్పష్టము చేయుచునే యున్నవి. వితండ వాదముగాని, వాగ్జాలముగాని, మహా యాంత్రగహచక్రములు గాని

గ్రామముల దుస్థితిని ముసుగుపరచ జాలవు. మానవజాతిపట్ల చేయబడిన యీ మహాపరాధమునకై - చరిత్రయందు సాటిలేని యీ మహాపరాధమునకై ఇంగ్లాండు దేశీయులును, భారతీయ పట్టణవాసులును ఆ జగన్నాథుని యెదుట - వాడొకడున్నచో - చేతులు కట్టుకొని జవాబు చెప్పవలసి యున్నదనుటలో రవ్వంత సందేహమును లేదు.

(1822 కోర్టు సాక్ష్యమునుండి)

# 1. మన గ్రామములు

గ్రామమందుండి పొట్టబోసికొనుటకు ప్రయత్నము చేయుచున్న యొక యువకుని యొద్దనుండి విచారకరమైన జాబొకటి నాకు చేరినది. అతడు విశేషించి ఆంగ్లేయ భాషాజ్ఞానము గనివాడు. అందుచే అతని జాబునందలి సారాంశమును మాత్రము ఈక్రింద పొందుపరచు చున్నాను.

"నావయసు 23 సంవత్సరములు. బస్తీలో పదునైదు సంవత్సరములు గడిపి మూడు సంవత్సరముల క్రితము గ్రామ జీవనమున ప్రవేశించితిని. గృహపరిస్థితులు కారణముగ నేను కాలేజీవిద్య నభ్యసింపజాలక పోతిని. అందుచే తమ రారంభించిన గ్రామ పునర్నిర్మాణ కార్యక్రమము నన్ను గ్రామజీవనమునకు ప్రోత్సహించినది. నాకు కొంచెము భూమిగలదు. మాగ్రామ జనసంఖ్య షుమారు 2500. నాకు గ్రామస్థులతో పరిచయము కాగా వారియందు – నాల్గింట మూడుపాళ్ళ జనులతో ఈక్రింది విషయములు పొడగట్టినవి.

1. కక్షలు, తగాయిదాలు
2. ఈర్ష్యా ద్వేషములు
3. నిరక్షరాస్యత
4. దుండగము
5. అనైకమత్యములు
6. నిర్లక్ష్యము
7. ఒక పద్ధతి లేకుండుట
8. నిష్ప్రయోజకరములై బూజు పట్టిపోయిన పూర్వాచారములను పట్టుకొని వ్రేలాడుట
9. నిర్దాక్షిణ్యము.

"ఈగ్రామ మొక మూరుమూల నున్నది. సాధారణముగా నిచటి కెవరును వచ్చుచుండరు. గొప్ప సాధనములు

ఇష్టపూర్వకముగ గ్రామమున కెన్నడును రాను. కాని గ్రామముల యభివృద్ధికి నాయకుల సంపర్కమును సాహచర్యమును అవసరము. అందుచేత గ్రామమం దుండుటకు నేను చాల వ్యాకులపడుచున్నాను. ఈ గ్రామమును వదలిపెట్టుదమా యని అనిపించుచున్నది. తమరు నాకు సలహాయును, ఆదేశమును నీయగలరా?"

ఈ యువకుడు వర్ణించిన గ్రామ స్వరూపములో కొంత యతిశయోక్తి కలదనుటకు సందేహము లేదు. కాని అతడు చెప్పినదానిని సామాన్యముగా మన మంగీకరింప వచ్చును. ఇట్టి దుస్థితికి గల హేతువును కనుగొనుటకు ఎక్కువదూరము పోనక్కరలేదు. ఏమన విద్యాభాగ్యము లభించినవారు గ్రామమును మిక్కిలి యుపేక్షాభావముతో చూచుచున్నారు. వారు తమ కొరకు పట్టణజీవనమునే ఎన్నుకొనిరి. సేవాభావము గలవారు గ్రామములందు నివాస మేర్పరచుకొని గ్రామస్థుల సేవ చేయునట్లును, వారితో చక్కని సంబంధ మేర్పరచుకొనునట్లును చూచుటకే గ్రామోద్ధరణ ఉద్యమము ప్రయత్నించుచున్నది. జాబు వ్రాసిన యువకుడు తెలిపిన దోషములు గ్రామజీవనమునకు స్వభావసిద్ధములుగా లేవు. అంతేగాక సేవాభావముతో గ్రామనివాసము చేయువారు అచటి కష్టములను చూచి నిరుత్సాహులు కారు. అచటి కష్టముల నివారించుటలో గ్రామస్థులు తోడ్పడక యుదాసీనులుగ నున్నను, తమ కర్తవ్యమును తాము నెరవేర్చుకొనవలసి యుండునని తెలిసికొనియే సేవకులు గ్రామములకు వెళ్ళుదురు. తమ విద్యుక్త

కార్యమందును, తనపైనను విశ్వాసము గలవారు మాత్రమే గ్రామస్థుల సేవచేసి వారిజీవనముపై కొంత ప్రభావము చేయ గల్గుదురు. సత్య జీవనమును, సద్వర్తనమును నిజముగా చుట్టు ప్రక్కల వారిపైన ప్రభావమును తప్పక ప్రసరింప జేయగల గుణపాఠమై యున్నది. కాని యీనవయువకులకు కల్గిన నష్టము సేవాభావమునకు సంబంధించినది కాక జీవన నిర్వాహమునకు సంబంధించినట్టిదై యున్నది. కేవలము సంపాదనార్థమై గ్రామ ములకు వెళ్ళువారికి ఆకర్షణమేమియు కనబడదని నేనంగీకరింతును. వారికి నిత్య నూతనత్వ మేమియు కానరాక గ్రామజీవనము నీరసముగా నుండును. కనుక గ్రామమునకు వెళ్ళు యువకులు అచటి కష్టములు చూచి గాబరాపడి తమ మార్గమును వీడ రాదు. ఓర్పుతో విడువక ప్రయత్నము చేసినచో, గ్రామస్థులు కూడ పట్టణవాసుల వంటివారే యనియు, వారిపై శ్రద్ధ, సాను భూతియుంచినచో వారుకూడ తమ సహకారము నిచ్చెదరనియు తెలియగలరు. గొప్ప దేశీయనాయకుల పరిచయ భాగ్యము పొందునవకాశములు గ్రామస్థులకు నిజముగా లభ్యమగుటలేదు. గ్రామ చిత్తవృత్తి పెంపుచేసుకొని, గ్రామములందు పర్యటించు టయు, వానితో సజీవసంబంధము స్థాపించుకొనుటయు నాయకు లకు ముఖ్య కర్తవ్యమైయున్నది. కాని చైతన్యుడు, రామకృష్ణుడు, తులసీదాస్, కబీర్, నానక్, దాదు, తుకారాం, తిరువళ్ళూరు మొదలగు సాధువుల, యోగిపుంగవుల సత్సాంగత్యము గ్రంథ రూపేణ జనులకు నేటికిని లభ్యమైయున్నది. చిక్కు ఏమనగా శాశ్వతమైన యీ మహద్విషయములను గ్రహింప గల్గుటకు

మనసును యోగ్యముగ చేయుటెటులాయని! రాజకీయ ఆర్థిక సామాజిక వైజ్ఞానిక సాహిత్యమును లభింప జేయుటయే ఆధునిక యోచనాపరుల ఆశయమగుచో, అట్టి సాహిత్యమును జనులకు లభింపగలదు. కాని ధార్మిక సాహిత్యమువలె ఇది అంత సులభముగా లభింపదని నేనంగీకరింతును. సాధువులు, యోగులు, భక్తవరేణ్యులు సామాన్య జనుల కొఱకే వ్రాసిరి; వారి కొఱకే భాషించిరి. కాని, సామాన్య ప్రజల కర్థమగు రీతిని అనువాదము చేయవలెనను ప్రేమ ఆధునిక భావకులకు ఇంకను పూర్తిగ కలుగలేదు. అది క్రమముగా ఏర్పడగలదు. కనుక జాబువ్రాసిన యువకుని వంటి వారు తమ ప్రయత్నములను విడువ వలదనియు, మరింత నిమగ్నులు కావలసిన దనియు వారికి నాసలహా. తమ యుపస్థితి నివాసము - వలన గ్రామమును ఎక్కువ సుందరమైనదిగను, నివాసమున కధిక యోగ్యమైనదిగను చేయవలెను. గ్రామస్థులకు ప్రియమైన సేవ ద్వారానే యీకార్యములు చేయగల్గుదురు. తమశక్తి ననుసరించి స్వయముగ కష్టించి గ్రామమును శుభ్రపరచుట తోడను, నిరక్షరాస్యత నిర్మూలించుట తోడను ఈకార్యము నారంభింపవచ్చును. గ్రామసేవకులు తమజీవమును విశుద్ధముగను నియమబద్ధముగను నడపినచో గ్రామస్థులును వారి ననుసరించి పరిశుద్ధులు, శ్రమశీలురు, దేహసౌష్టవము గలవారు అయ్యెదరు.

# 2. గ్రామ ఆరోగ్యము

ఆరోగ్య దృష్ట్యా గ్రామములస్థితి అత్యంత శోచనీయముగా నున్నది. సులభముగా తెలిసికొనజాలినట్టియు, అత్యావసరమైనట్టియు ఆరోగ్యాంశముల నెరుగకపోవుటయే మన దారిద్ర్యమునకు ప్రబలకారణము. గ్రామారోగ్యము చక్కబడగలుగుచో లక్షలాది రూప్యములు సులభముగా మిగుల గలవు. మరియు ఆమేరకు ప్రజల స్థితియు చక్కబడును. రోగమెరుగని, రైతు చేయజాలినంతపనిని రోగిష్టిరైతు చేయజాలడు. మనదేశమున మరణములు ఇతరదేశములకంటె అధికముగ నున్నవి. వీనివలన కలుగు నష్టము స్వల్పమని యెంచరాదు.

ఆరోగ్య సంబంధమైన యీదుస్థితికి మన ఆర్థిక దశయే కారణమనియు, యిది బాగుపడినచో మొదటిది దానంతట అదే చక్కబడుననియు కొందరు చెప్పుచుందురు. ప్రభుత్వమును దూషించు ఉద్దేశ్యముతోను, దోషమంతయు ప్రభుత్వము నెత్తిపై రుద్దు తలంపుతోను ఆవిధముగ చెప్పిన చెప్పవచ్చును. కాని యిందు యథార్థము సగపాలు కూడ లేదు. మనము అస్వస్థులుగా యుండుటకు మన ఆర్థికస్థితి యొక్కపాలు అల్పమనునది నాకు అనుభవసిద్ధవిషయము. ఎక్కడెక్కడ యేది యెంతెంత భాగమున్నది నాకు తెలియును. కాని యిచట నేనావిషయము ప్రస్తావించ దలంచుటలేదు.

మన లోటుపాట్లవలన సంభవించు నట్టియు, సులభముగను నామమాత్రపు ఖర్చుతోను, లేక ఉచితముగను లభించు

ఎచట బట్టిన నచ్చట పిల్లలు మలవిసర్జన చేయుచు కనబడు చుందురు. మూత్రవిసర్జన విషయము చెప్పనక్కరయే లేదు. పెద్దలు సహితము యీ సత్కార్య మాచరించుచు ఏవీధినైనను కనబడుచుందురు. క్రొత్తగా వచ్చిన విదేశీయులు గ్రామము నకును, పెంట కుప్పలకును విభేదము కనుగొనజాలరు. వాస్తవ మునకు భేదమును అత్యల్పమే.

ఈ యాచారము – ఎంత పురాతనమైన దైనను దురాచారమే. మరి దానిని తొలగింపవలసియే యున్నది. మనుస్మృతి మొదలగు హిందూధర్మ శాస్త్రములలోను, ఖురాను, బైబిల్, మొదలైన మతగ్రంథము లందును, జరదుష్ట్ర ఋషి ఆజ్ఞలందును గృహము, ముంగిలి, వీధి, కాలువ, బావి, నది మొదలైన వానిని మురికి చేయరాదను అనేక సూత్రములున్నవి. కాని నేడు మనము ఆ శాస్త్రాజ్ఞలను ఉల్లంఘించుచునే యున్నాము. కడకు తీర్థక్షేత్రములందు సహితము రోత చేయుచున్నాము. గ్రామముల కంటెను అవి మరింత అశుభ్రముగ చేయబడు చున్నవని చెప్పినను అందతిశయోక్తి యేమియు నుండదు.

హరిద్వారములో గంగానదీ తీరమును వేలాది స్త్రీ పురుషులు సర్వానహ్యము చేయుచుండుట చూచితిని. మనుష్యులు విశ్రాంతికై కూర్చుండు స్థలములందే యాత్రికులు 'బహిర్దేశము'నకు (బైలుకు) కూర్చుందురు. మరల ఆతీరమందే ముఖప్రక్షాళనము చేసికొను చుందురు. ఆనీటినే తీసికొని పోవుచుందురు – పుణ్యక్షేత్రములలో ఈవిధముగా తటాకములను చెడగొట్టు చుండు యాత్రికులను చూచితిని. దీనినిబట్టి

ఏమి తెలిసికొనవచ్చును. దయాధర్మములు లోపించినవన్న మాట. సాంఘికధర్మము నిర్లక్ష్యము చేయబడినదన్నమాట.

ఈనిర్లక్ష్యము వలన వాయువు అశుద్ధమగుచున్నది. నీరు చెడి పోవుచున్నది. ఇక కలరా, టైఫాయిడ్, మొదలగు అంటువ్యాధులు వ్యాపించుటలో నాశ్చర్య మేమున్నది? కలరా పుట్టుకకు కారణము మురికినీరే ఆయెను! టైఫాయిడ్ జ్వరములు కల్గుటకును అత్యధికముగ కారణమిదియేయని చెప్ప వచ్చును. మనకు సంభవించు వ్యాధులలో నూటికి డెబ్బది వ్యాధులు పరిశుభ్రత లేకపోవుటచేతనే - మురికివలననే కల్గుచున్నవని చెప్పవచ్చును.

కనుక గ్రామస్థునకు పరిశుభ్రతను గూర్చియు, - స్వచ్ఛతను గూర్చియు బోధించుటయే గ్రామసేవకుని ప్రథమకర్తవ్యము ఈపరిశుభ్రతా శిక్షణ గరపుటలో ఉపన్యాసములు, విజ్ఞప్తులు నిష్ప్రయోజన కరములు. కారణమేమన గ్రామస్థులు స్వయం సేవకుని మాటలు వినుటకు సిద్ధపడరు. వారు అంతటి మురికి కూపమున ఉన్నారు. ఒకవేళ విన్నను ఆప్రకార మనుసరించుట కుత్సహింపరు. విజ్ఞప్తులు పంచినను వాని ముఖమునైనను చూడరు. అసలు బహుజనులకు అక్షరజ్ఞానమే యుండదు. ఇతరులచే చదివించుకొందమన్న జిజ్ఞాసయు వారి కుండదు.

ఈ కారణముచే వారికి వస్తుపాఠము నిచ్చుటయే (చేసి చూపుటయే) స్వయంసేవకుని ధర్మమై యున్నది. గ్రామస్థులచే తా నేది జేయింపవలయునో నద్దానిని స్వయంసేవకుడు

తానే స్వయముగ చేసి చూపవలయును. అప్పుడే వారు చేయ గలరు. తప్పక చేయుదురు కూడను. ఇందులో యెవరికిని ఎట్టి సంశయ ముండ నవసరము లేదు. అయినను ఓపిక పట్టి ఉండ వలసిన అవసరమున్నది. నాల్గుదినములు మనము జేసినచో యిక గ్రామ గ్రామస్థులే తమకు తాము చేసుకొందురను భ్రమలో మనము పడకూడదు.

స్వయంసేవకుడు మొట్ట మొదట గ్రామస్థుల నందరను ఒకచోట చేర్చి వారి ధర్మమును వారి కెరుకపరచవలెను. ఆ సమావేశమున అప్పటి కప్పుడు వారిలో నుండి స్వయం సేవకులు కొందరు ముందుకు వచ్చినను రాకపోయినను తాను మాత్రము గ్రామ పారిశుద్ధ్య కార్యక్రమమును ఆరంభింప వలసినదే. అతడు గ్రామస్థుల నుండి పార, తట్ట, చీపురు సంపా దించుకొనవలెను. తిరిగి యిచ్చెదనని చెప్పిన మీదట వారీ వస్తువులను యివ్వకుండ ఉండరు. అంతట స్వయంసేవకుడు వీధుల నన్నింటిని పరిశీలింపవలెను. మలమూత్రములున్న ప్రదే శములకు పోవలయును. మలమును పారతో తీసి తట్టనందు వైచి ఆ స్థలమున మట్టి జల్లవలయును. మూత్రమున్న చోటను పారతో పై తడిసిన మట్టినంతయు తీసి తట్టలో వేసికొనవల యును. ఆ స్థలము పై చుట్టు ప్రక్కలనున్న దుమ్మును, ధూళిని చల్లవలయును, చుట్టు ప్రక్కల చెత్త చెదారమున్నచో దానిని కూడ ప్రోగుచేసి అంచున నొక ప్రక్క వేరుగ నుంచి మల మును తట్టలో సరిచేసిన పిమ్మట దానిపై యీ గడ్డి గాదమును వేయవలయును.

ఈ పెంటను ఎక్కడ వేయవలయు ననునది ఒక ముఖ్యమైన ప్రశ్న. ఇందులో పరిశుభ్రతయు, ధనార్జనమును రెండును గలవు. బహిరంగ ప్రదేశములందు పడియున్న మలము దుర్గంధమును వ్యాపింపజేయును. ఈగలు వానిపై వ్రాలి తిరిగి శరీరముల మీదను ఆహార పదార్థముల మీదను వ్రాలి రోగపు అంటును నలువైపుల వ్యాపింప జేయుచున్నవి. ఈగల యీ చేష్టలను సూక్ష్మదర్శక యంత్రము ద్వారా చూచినచో బజారులో అమ్మబడు మిఠాయి దినుసులు సహితము విసర్జింపవలసి వచ్చును.

ఈ పెంట వ్యవసాయదారుల పాలిట బంగారము. పొలములో వేయుటవలన అమూల్యమైన యెరువుగ తయారగును. మంచి పంట నిచ్చును. ఈవిషయములో చీనా దేశీయులు మహా వివేకులు. వారు మలమూత్రములను బంగారమువలె ప్రోగు చేసికొని కోట్లకొలది రూపాయలు నిలువ చేసికొను చున్నారట! అనేక వ్యాధులనుండి విముక్తియు పొందుచున్నారు.

కనుక స్వయంసేవకుడు రైతులకీ విషయము తెలియజెప్పవలెను. అనుమతించిన రైతుయొక్క పొలములో యీమలమును పూడ్చవలెను. అజ్ఞానముచే యేరైతైనను స్వయంసేవకుని పారిశుధ్యమును త్రోసిపుచ్చినచో అతడు యేదోయొక తగిన ప్రదేశ మన్వేషించి పెంటపోగుపై మలమును పూడ్చవలెను. అటుపిమ్మట చెత్త, చెదారము, పోగులవైపును మరలవలెను.

చెత్తచెదారము (చెత్త) రెండువిధములుగా యుండును. ఎరువుగా నుపయోగించు నట్టి తొక్కలు, ముక్కలు, కాయల

బెరడులు, ఆకులు, గడ్డి మొదలైనవి ఒకరకము. రాళ్ళు రప్పలు లోహపుతునకలు మొదలైనవి రెండవరకము. ఇందు మొదటి రకమును అనగా ఎరువునకు యోగ్యమైన కసవును పొలము నందుగాని, ఎరువు రూపమున నిల్వజేయవలసిన ప్రదేశమునందుగాని చేర్చవలెను. రెండవరకమును అనగా ఎరువునకు యోగ్యముగా నట్టికసవును గుంటలు, గోతులు పూడ్చుటకు ఉపయోగించవలెను. అందువలన గ్రామము పరిశుభ్రమగును. పాదరక్షలు లేకుండ నడచువారికి హాయిగను నుండును. కొన్ని దినములు పరిశ్రమ చేసినపిమ్మట జనులు తప్పక దీనిని అవగాహన జేసికొనగలరు. తమకు తామే సహాయము జేసికొన నారంభింతురు. కడకు తమకు తామే నిర్వహించు కొందురు. ప్రతిరైతు స్వయముగా తన యింటి పురీషమును తన పొలమున కుపయోగించుకొనవలెను. దీనివలన రెండులాభములు: ఒకరి భారము మరొకరిపై పడకుండుట మొదటిది. రైతులెల్లరు తమ తమ పంటలలో అభివృద్ధిని పొందగలుగుదురు. ఇది రెండవలాభము. వీధులందును మార్గములందును బైలుకు కూర్చుండుట యెన్నటికిని కూడనిపని. బహిరంగ ప్రదేశములో అందరి యెదుట బైలుకు కూర్చుండుటయు పిల్లలను కూర్చుండబెట్టుటయు అసభ్యతయై యున్నది. ఇది అసభ్యత అను జ్ఞానము మనకు లేకపోలేదు. ఎట్లనగా మలవిసర్జన చేయు సమయమున యెవరైనను ఎదురుగా పోవుచు కన్పించుచో మనము తల వంచుకొనుచుందుము. ఇందుకై ప్రతి గ్రామమునందును ఎచటనో నొక స్థానమునం దొక పాకీదొడ్డు ఏర్పరుపవలెను. పెంటపోగుల

స్థలమే దీనికి నుపయోగింప వచ్చును. ఈ విధముగా ప్రోగు చేసిన ఎరువును రైతులు తమలో తాము పంచుకొన వచ్చును. రైతులు యీ బందోబస్తు జేసికొన నంతవరకు స్వయంసేవకుడు వీధులను శుభ్రపరచునట్లే గృహమును కూడ శుభ్రపరుపవలెను. నిత్యము ఉదయము గ్రామస్థులు తమ కాలకృత్యములు తీర్చుకొనిన పిమ్మట నియమిత సమయమున స్వయంసేవకుడు దానిని పెంటపోగులపైన వేసి పైన తెల్పిన విధమున సరిచేయవలయును. పొలమేదైనను లభించనిచో పురీషమును పూడ్చి ఆ స్థలముపై గుర్తుగా నేదైన నుంచవలయును. దీనివలన ప్రతిరోజు వేయుచుండుటలో సౌలభ్యము కలుగును. మరియు రైతులు దీని మహాత్త్వమును తెలిసికొనిన పిదప యీ ప్రోగుచేసిన యెరువును ఉపయోగించుకొన గల్గుదురు కూడను.

ఈ మలమును మిక్కిలి లోతుగా పాతరాదు. భూతలమున నుండి తొమ్మిదంగుళముల లోతు వరకు అత్యంత పరోపకారములైన జీవులు నివసించు చుండును. ఈమాత్రపు లోతున భూమియందేమియున్నను దాని నీ క్రిములు యెరువుగ మార్చును. మరికి నంతను పరిశుభ్రము చేయును. ఇదియే అవి చేయు పని. సూర్యకిరణములును రామబాణమువలె మిక్కిలి యుపకారము చేయును. ఈ విషయ పరీక్షణము చేయదలచిన వారు స్వయముగా స్వానుభవ పూర్వకముగా చూడవచ్చును. కొంత పురీషమును తొమ్మిదంగుళముల లోతులో పాతుము. ఒక వారమైన పిమ్మట నేలను త్రవ్వి అదేమయినదో చూడుము.

ఇట్టులనే మరికొంత పురీషమును మూడు నాల్గుసుగులలో తులో పాటి వారమైన పిమ్మట దానిని పరీక్షించి చూడుము. ఇట్టి పరిశోధన మూలమున అనుభవ జ్ఞానము లభించును. మలమును పల్చగా పై పైన చల్లి పూడ్చవలెను. కాని దానిపై మట్టిని పూర్తిగా కప్పవలయును. అపుడు కుక్కలు దానిని త్రవ్వ జాలవు, దుర్గంధమును రాజాలదు. కుక్కల నాపుటకై దానిపై ముండ్ల కంపను వేయవచ్చును.

దీనితోబాటు మరియొక విషయమును తెలిసికొనవలసి యున్నది. పురీషమును పూడ్చుటకుగాను సమచతురస్రము లేక దీర్ఘచతురస్రపు ఆకారము గల విశాలమైన గోతులను తీయ వలెను. ఎందుచేతననగా, పూడ్చిన మలముపై మరల మలము వేయరాదు. దానిని వెంటనే వెలుపలకు తీయనురాదు. అందుచే మొదటి దినమున పెంట పూడ్చబడిన స్థలమునకు ప్రక్కనే మరియొక నలుచదరపు ప్రతిని తీయవలెను. త్రవ్వగా వచ్చిన మట్టిని రెండ్డున ఉంచవలెను. మరునాడు ఆ గుంటయందు మలము వేయబడినపుడు దానిపై ఈ మట్టిని వేసి నాల్గు మూలలను సర్దవలెను. స్థలమంతయు నలుచదరమై సాఫీగ చేయబడ వలెను. ఇదే విధముగ తొక్కలు మొదలైనవానిని వేరే ప్రత్యేక స్థలమున పూడ్చవలెను. వేరుగ ఎందుచేతననగా మలముపైనను, తొక్కలు తోళ్లు మీదను సూక్ష్మజీవులు ఒకే విధముగ పని చేయజాలవు.

మలము పూడ్చబడిన స్థలము సదా పరిశుభ్రముగను, స్వచ్ఛముగను అప్పుడే సంపాదింపబడిన తాజా భూమివలెను

ఉండవలయును. ఈసంగతి స్వయంసేవకు డిప్పటికి తెలిసికొనియే యుండవచ్చును. రాళ్ళు - రప్పలు, ఇనుప ముక్కలు మొదలైన వానిని లోతైన గోతిలో పూడ్చవలెను. గ్రామములో నెచట నైనను గోతులు, గుంట లుండుచో వానిలో ఈ రాళ్ళు రప్పలు వేసి మెరక చేయవలెను. ఇదియు నిత్యము చేయవలసిన పనియే. దీని మూలమున గ్రామ పారిశుద్ధ్యము స్థిరపడును.

ఈ విధముగ ఎక్కువ ఆయాసము లేకయే గ్రామ మొక నెలలో పెంటపోగువలెగాక పరిశుభ్రముగను సుందరముగను తయారు కాగలదు. ఇందుకు ధనము వెచ్చింప నక్కరలేదను సంగతి పాఠకుడు గ్రహించియే యుండును. ఇందుకు ప్రభుత్వ సాహాయ్యము గాని, విశేషమైన వైజ్ఞానిక శక్తిగాని అవసరము లేదు. ప్రేమాభిమానములుగల స్వయంసేవకులు మాత్రము అవసరము.

మనుష్య మూత్ర పురీషముల విషయమై చెప్పిన దంతయు పశువుల మూత్రమునకును, పేడకును అన్వయించును సని వేరుగ చెప్పననసరము లేదు.

## ౬. పిడకలా లేక ఎరువా?

వెనుకటి ప్రకరణమున మనుష్యుని మలమూత్రముల విషయము ప్రస్తావించియున్నాము. ఆవు, గేదె మొదలగు జంతువుల మలమూత్రమును బొత్తిగా మన ముపయోగించుట లేదు. అందుచే అది అనారోగ్యమును, మురికిని వ్యాపింపజేయు పనిని చేయుచున్నది. సాధారణముగా ఇప్పుడు పేడను పిడకలు

చేయుట కుపయోగించుచున్నారు. ఇది పేడను దురుపయోగము చేయుటయని అనలేకపోయినను, అతిస్వల్ప ఉపయోగమేయని చెప్పుటకు కెట్టి సందేహము నవసరములేదు. ఇది పైకప్పు నూడ బెరికి పొయ్యిక్రింద పెట్టుట వంటిది. పిడకలు బహు సన్నసెగ నీయగలవని అందరంగీకరించుచున్నారు. హుక్కా త్రాగు వారును దీనిని మిక్కిలిగ నుపయోగించుకొనుచున్నారు. పిడకలసెగతో మంచి రుచిగల నెయ్యి తయారగునని పంజాబువైపు వారి యభిప్రాయము. ఇందు కొంత సత్యముండవచ్చును; కాని పేడను పిడకలుగా చేయుచున్నారు కనుకనే వారీయుక్తు లన్నిటిని చూపుచున్నారు. పేడవలని కల్గు సంపూర్ణ లాభమును మనము పొందసాగినచో సన్నసెగకై యేదోయొక యుపాయమును కనుగొనలేకపోము. పేడను పిడకలుగా నుపయోగించుట కంటె ఎరువుగా నుపయోగించినచో పదింతలు లాభము వచ్చును. పిడకలుగా నుపయోగించుటవలన కల్గు నష్టము ఇంత అంత యని చెప్పజాలము.

పేడయొక్క సద్వినియోగమంతయు దానిని ఎరువుగ నుపయోగించుటలోనే యున్నది. పేడను పొయ్యి క్రింద కుపయోగించుటచేత భూమిసారము క్షీణించుచున్నదని వ్యవసాయ శాస్త్రవేత్తలు చెప్పుచున్నారు. ఎరువులేని నేల నెయ్యిలేనిలడ్డు అని గ్రహింపవలెను. అతిబలము నిచ్చునట్టి ఎరువగు పేడను పొయ్యిలో పారవేసి రసాయనిక ఎరువులను కొనుటకై ప్రాకు లాడు మూర్ఖరైతులు భారతదేశములో నుండరని తలంతును. పోల్చిచూచినచో, రసాయనిక యెరువులకంటె పేడ యుపయో

గనే యధికమైనదని రైతులును అంగీకరించియున్నారు. రసాయనిక యెరువుల వాడకమువలన లాభముతోపాటు నష్టములు గలవు. శాస్త్రజ్ఞుల పరిశోధన లింకను పూర్తికాకున్నను వారలనేకులు ఒక్క-విషయముమాత్రము నంగీకరించుచున్నారు. అది యేమన - రసాయనిక యెరువులవలన తరచుగా పంట వృద్ధి యగును. కళకళలాడు చుండును. కాని దాని నాణ్యత, గుణము తగ్గుచున్నది-అని. ఈ రసాయనిక యెరువులవలన గోధుమలు అత్యధికముగ పండుననియు, గింజ లావుగానుండుననియు, మెర మెరలాడు చుండుననియు కాని స్వాభావిక యెరువులవలన పండిన గోధుమలు పరిమాణములో తక్కువైనను మాధుర్యము, పుష్టి-వీనిలో మాత్రము ఈగోధుమలదే పైచెయ్యి అని అనేక శాస్త్రజ్ఞుల యభిప్రాయము. ఈ పరిశోధనలు పూర్తియగునప్పటికి రసాయనిక యెరువుల ప్రయోజనము మనమిప్పు డూహించు చున్నదానికంటె యింకను తక్కువగుటకూడ సంభవించవచ్చును.

ఏది యెట్లున్నను పేడను ఎరువుగ మాత్రమే యుప యోగింపవలెను. ఇందు రెండు అభిప్రాయములులేవు. అందుచే పశువుల పేడను, మూత్రమును ఎరువుగ నుపయోగించు పద్ధతి నను - తత్సంబంధమైన యావద్విషయములను గ్రామీణులకు తెలియజేయుట గ్రామసేవకుని ధర్మమై యున్నది. పిడకలను గూర్చిన భ్రమను మోహమును ప్రజలనుండి పారద్రోలుట, పిడకలకు బదులుగా అట్టి సెగనే యిచ్చు మరియొక వంట చెరకును కనుగొనుట, గొడ్ల పేడను, మూత్రమును, ఎరువుగ

నుపయోగించుటలో గల గొప్పలాభములను చక్కగా బోధ పరచుట, అందుకు తగిన జ్ఞానమును స్వయముగా తాను సంపాదించుట - ఇదియంతయు గ్రామసేవకుని కర్తవ్యము.

ఈ విషయ మెంత రసభరితమో, అంత లాభదాయకము నై యున్నది. పరిశ్రమశీలుఁడైన పరిశోధకునకు ఇందు జ్ఞాన భాండార మిమిడియున్నది. మనుష్య మలమూత్రముల విషయమున ధనము గాని పాండిత్యము గాని అక్కరలేనటులనే, ఇందును అవసరములేదు. గత ప్రకరణములందు చెప్పినటుల ప్రేమాభిమానములు మాత్రము కావలసియున్నవి.

## 5. గ్రామవ్యాధులు

ప్రజలవిద్య అన్నప్పుడు అక్షర జ్ఞానావశ్యకతకు అతి స్వల్పప్రాముఖ్యమే నీయవలెను. జీవన ముఖ్యరంగములలో అక్షరజ్ఞానమునకు స్థానమేలేదు - దానియవసరమేలేదు. మన అత్యంత ఆఖరిస్థితికి - ఐహిక పారలౌకిక మోక్షమునకు అక్షర జ్ఞాన మవసరమేలేదు అను సత్యమును ఎవరు నిరాకరింప గలరు! ఈ కోట్లజనులు అక్షరజ్ఞానము పొందువరకు, చదువను వ్రాయను నేర్చువరకు, స్వరాజ్యసంపాదనమును ఆపవలె ననుచో స్వరాజ్యప్రాప్తి దాదాపుగా యసంభవమే యగును. ప్రపంచమునకు మహోపదేశము గావించిన జీసస్ క్రీస్తువంటి మహాత్ములకు అక్షరజ్ఞాన ముండెనని ఎవ్వరును చెప్పలేదు.

ఈ వ్యాసమాల అంచనాలో అక్షరాస్యతకు అన్నిటి కంటెను ఆఖరిస్థాన మీయబడినది. అక్షరజ్ఞాన మొక సాధనము

మాత్రమే, గమ్యస్థానము కాదు. సాధనముగ అది మిక్కిలి యుపయోగకారియని అంద రెరిగినదే. పనిపాటలలో మునిగి తేలుచుండు కోట్లకొలది వయోజనులకు — రైతులకు ఎట్టి జ్ఞాన మత్యావసరమని యోచించినచో, అక్షరజ్ఞానముకంటెను ముందు ఇప్పుడు వెంటనే తెలిసికొనవలసిన విషయములు అనేకములు గలవని బోధపడగలదు. శ్రీ బెక్ గారి గ్రంథమునుండి కేవల మొక స్వల్పభాగసారాంశము మాత్రమే యిచ్చినాను. దానిని బట్టియు ఇదే తేలుచున్నది.

ఈ దృష్టితోనే గ్రామపారిశుద్ధ్యమునుగూర్చియు ఆలోచించితిని. గత అధ్యాయములో తెలుపబడిన సంస్కరణ జ్ఞానము రైతునకు సులభముగ అందగలదు. ఆ జ్ఞానప్రాప్తి గల ఆటంకములు రెండు: యథార్థమైన సేవకులు లేకపోవుటయు, రైతుల సోమరితనమును.

ఇప్పుడిక గ్రామములందలి సాధారణవ్యాధులను విచారింతము. జ్వరము, కడుపునొప్పి, కురుపులు — ఇవి గ్రామములందు సాధారణముగ వచ్చుచుండు వ్యాధులని గ్రామమందున్న నా మిత్రుల యభిప్రాయము. ఇంకను అనేక వ్యాధులు కల్గుచుండును. కాని వానినన్నిటినిగూర్చి ఇచట చర్చించ వలసినపనిలేదు. రైతుల పనిపాటల నడ్డగించు వ్యాధులు ఈ మూడే. ఈ వ్యాధులకు గృహచికిత్స తెలిసికొనుట మిక్కిలి యవసరము. ఈ వ్యాధుల నుపేక్షించి, నిర్లక్ష్యపెట్టి కోట్లు నష్టపడుచున్నాము. ఈ వ్యాధులను బహు సులభముగా నివారింపవచ్చును. చాంపరానము (బీహారు)లో కీర్తిశేషులైన డా॥ దేవు

గారి అజమాయిషీ క్రింద ఆరంభింపబడిన కార్యక్రమములో ఈ వ్యాధుల నివారణమును గలదు. స్వయంసేవకుల యొద్ద మా ఔషధములకు మించి మరి యే యౌషధము నుండెడిది గాదు. తరువాత పొందిన అనుభవమును ఈ విషయమునే తెలుపుచున్నది. కాని యీ వ్యాసమాలలో ఈ వ్యాధి నివారణోపాయములను తెలుపబోవుటలేదు. అది వేరేవిషయము; చికిత్సని విషయము. ఈ మూడువ్యాధులకు శాస్త్రోక్తమైన ఉపచారములు చేయుట రైతులకు నేర్పవలెననియు, ఆపని సులభమనియు గ్రామసేవకులు తెలిసికొనవలెను. గ్రామము పరిశుద్ధముగా ఉండుచో చాలవ్యాధులు కలుగనేరవు. వ్యాధివచ్చిన పిమ్మట మందుమాకులిచ్చి నయముచేయుటకంటె, వ్యాధిని రానీయకుండ జేయుటయే ఉత్తమచికిత్సయని వైద్యులందరు అంగీకరించినట్టి విషయమే. అజీర్ణము రాకుండ చూచినచో కడుపు నొప్పి నివారణమైనట్లే. గ్రామమున గాలి స్వచ్ఛముగ నుండుచో జ్వరములు రాజాలవు. గ్రామమున జలము పరిశుద్ధముగ నుండుచో, దానినే స్నానపానాదుల కుపయోగించుచో కడుపులు రాజాలవు. ఈ మూడింటిలో ఏ వ్యాధి కలిగినను ఉపవాసమే యుత్తమ చికిత్స. ఇంకను ఉపవాసమున కటిస్నానము, సూర్యస్నానము చేయదగును. దీని వివరమంతయు "ఆరోగ్య రక్షణము" అను గ్రంథమునందు వ్రాయబడినది. ప్రతి స్వయంసేవకుడు దీనిని చదువవలెనని నా సలహా.

ప్రతి గ్రామమునకు ఒక ఆస్పత్రియో, లేక కనీసము ఒక చిన్న డిస్పెన్సరీయో యుండవలెనని నేడు ఎల్లరును చెప్పు

చున్నారు. కాని వీని యవసరము నాకేమాత్రమును కనబడుట లేదు. అనేక గ్రామముల నడుమ ఒక వైద్యశాల యుండుట మంచిదే. కాని దాని కింత ప్రాధాన్యము నీయరాదు. ఆస్పత్రి యున్నచోట రోగులు వచ్చి పడుచునేయుందురు. దీనినిబట్టి ఏడు లక్షల గ్రామములలో ఏడు లక్షల ఆసుపత్రు లుండుట ఉపయోగకర మని యోచరాదు. గ్రామ ఆస్పత్రి గ్రామశాల యగును. మరి గ్రామ పుస్తకభాండాగారమును అచటనే వెలయును. వ్యాధులు ప్రతి గ్రామమందును ఉండును గనుక ఆస్పత్రి ప్రతి గ్రామమున ఉండవలసినదే. గ్రామ పఠనాల యము, గ్రామచావడి అవసరమే గదా! ఈ మూటికిని వేరువేరు భవనము లుండవలెనని యాలోచించుచో సకల గ్రామములకు వీనిని ఏర్పరచు నప్పటికి కోట్ల ధనము వ్యయ మగుననియు బహుకాలము పట్టుననియు బోధపడగలదు. కనుక ప్రజావిజ్ఞాన ప్రయోజన విద్యాప్రచార సందర్భముననను, గ్రామసంస్కరణము విచారించు నపుడును మనదేశ దారిద్ర్యమును మనసునం దుంచుకొనవలెను.

ఈ విషయములను ఆలోచించు సందర్భమున పరదేశ స్థులను దోచుకొని కోటీశ్వరులైన మహానుభావుల భావము లను మనము అరువు తెచ్చుకొనకుండ యున్నను, మనలో యథార్థ జాగృతి కలిగియున్నను, మన గ్రామముల రంగు ఎప్పుడో మారి యుండెడిది.

# 6. బావులు - చెరువులు

గ్రామ నిర్మాణ సందర్భమున పూర్వము చూడబడి నట్టియు, నేడును చూడవలసియున్నట్టియు ముఖ్యాంశము నీరు. చక్కని మంచినీటి సదుపాయములు లేని చోటను, నీరుపడని చోటను ఊరు కట్టుట అను యాలోచనే పెట్టుకొనరాదు. కొన్ని కొన్ని ప్రాంతములలో నీరు లభింపనందున గ్రామము లేర్పడలేదు. గాలి మానవుని ప్రాథమికావసరము. నీరు రెండ వది. ఇది వాయువువలె అంత మిక్కిలి సులభముగా లభిం చునది కాకపోయినను పంటలు పండించుటకువలె దీని కంత శ్రమచేయవలసిన పనిలేదు. కాని గాలి, పంట వలెనే నీరును పరిశుభ్రముగ నుండవలెను.

ఈ విషయమును తెలిసిన రైతులు కొందరు దీనిని నిర్లక్ష్యము చేయుచున్నారు. మరికొందరి కీ విషయము అసలు తెలియనే తెలియదు. అందుచే రైతులకిచ్చు శిక్షణములో నీటిని గూర్చిన పాఠమును ఉండుట యవసరము. మరియు గ్రామవాసులకు శిక్షణనిచ్చుట గ్రామసేవకుని ధైర్యమున కొక పరీక్ష. గ్రామవాసులు తమంతట తాము శ్రమపడి జలమును శుభ్రముగా నుంచుటకు తగిన యుపాయములను ఆలోచించెద రను ఆశలేదు. వారికి నీటిశుభ్రతావిషయము క్రమక్రమముగా తెలుపవలెను. ఈ పనిచేయుచున్న సమయమున వారి సాహా య్యమును పొందవచ్చును. తమకు లాభించుపనులకు సహితము గ్రామస్థులు సాధారణముగా సాయపడరు. ఇట్టి స్థితిలో స్వయం సేవకుడు తాను స్వయముగా పరిశ్రమచేసి తలపెట్టిన కార్య

మును జయప్రదముగ ముగించి గ్రామస్థులకు లజ్జ కలుగునట్లు చేయవలెను.

మనము ఏమిచేయవలెనో విచారింతము. చాల గ్రామములలో ఒకటే చెరువుండును. అందే పశువులు నీరు త్రాగును, మనుష్యులు స్నానమును చేయుదురు. అంట్లుతోముట, బట్టలుతుకుట అచటనే. కడకు త్రాగుటకును వారు ఈ ఉదకమునే పట్టుకొని పోవుదురు. ఇట్టి నీటిలో విషక్రిములు పుట్టుచుండు ననియు ఆ నీరు త్రాగినవారికి కలరా మొదలైన వ్యాధులు త్వరగా వ్యాపించుననియు ఆరోగ్యశాస్త్రకోవిదులు పరిశోధన పూర్వకముగా స్థిరపరచినారు. ఇట్టి చెరువులకు నాల్గువైపుల శ్రమజేసి పెద్ద కట్టలు వేయవలెను. అందువలన చెరువులోనికి పశువులు పోవుటకు వీలులేకుండును; కాని అవి నీరు త్రాగుటకు వేరుగ సదుపాయము చేయవలెను. అవి త్రాగుటకై ప్రత్యేకముగ నొక గుంట త్రవ్వవలెను. ఆ గ్రామస్థులందరు నిత్యము తలకొక కడవచొప్పున పోసిన ఆ గుంట నిండుచుండును. ఒక దినమునకు పశువు లన్నిటికి కావలసిన నీరు సప్లై అగును.

త్రాగుట కుపయోగపడు చెరువులో బట్ట లుతుకుటగాని, ఎంగిలిగిన్నెలు తోముటగాని, జరుగనీయరాదు. ఎల్లరు తమకు కావలసినంత నీటిని ఇంటికితీసికొనిపోయి అచటనే బట్టలుతుకు కొనవచ్చును. లేక చెరువునొద్దున ఒక తొట్టినిగట్టి వంతుల ప్రకారము అందు నీరుపోసికొనుచు దానిని యీ పనుల కుపయోగించుకొనవచ్చును. గ్రామస్థులలో పరస్పర సహకారము, పరోపకారబుద్ధి ఉన్నచో ఈ పనులు నెరవేరును. ప్రతి

మనుష్యు లీ విధముగ పనిచేయకపోయినను, కొంచెము ఖర్చుతో తొట్టిని గుంటను నింపవచ్చును. గుడ్డలుతుకు ప్రదేశమున నీరు పడుటచే బురదగుచుండును. కనుక అట్టి ప్రదేశమును గచ్చుచేయవలెను. బిందెలు కడవలు శుభ్రముగా ఇంటియొద్ద తోముకొని వచ్చిన పిమ్మటనే చెరువులో ముంచవలెను. నీళ్ళకు వచ్చినవారు నీళ్ళలో పాదములు పెట్టకుండ — దిగకుండ నీరు తీసికొని పోవుటకు తగిన సదుపాయము చేయవలెను. మరొక విషయము: అనేక గ్రామములలో ఒకటికంటె ఎక్కువ చెరువులున్నవి. అట్టిచోట మనుష్యులు త్రాగుట కొక చెరువు వేరుగ నుంచవలెను.

అనేక గ్రామములలో బావులున్నవి. ఈ బావులలోని నీరు పరిశుభ్రముగ నుండవలెను. బురద కాకుండు నటుల బావుల చుట్టును రాతి చప్టాలు కట్టింపవలెను. బావులను అపుడపుడు వెల్ల వేయింపవలెను. గ్రామసేవకు లీ పనిని స్వయముగ చేసి గ్రామస్థులచే చేయింపవలెను. ఈ విద్య ఖర్చులేనిది, వాస్తవమైనది, అవసరమైనది.

## 7. గ్రామ వీధులు

గ్రామమందలి పెంటపోగుల నెట్లు తొలగింపవలసినదియు, పెంటపోగుల వలన ఆరోగ్యమునకు కల్గు హానులను ఎట్లు తొలగింపవలసినదియును పెంటపోగులనుండి బంగారము వంటి యెరువు ఎటుల తయారగునదియు, పేడను పిడకలు చేయక ఎరువుగ నుపయోగించి అధికోత్పత్తి నెటుల చేయ

గల్గినదియు, చెరువులను బావులను పరిశుభ్రముగ నుంచుచు ఆరోగ్యము నెట్లు కాపాడుకొన గల్గినదియు — ఇంతవరకు పరామర్శించినాము.

ఇక మన దృష్టిని గ్రామరాస్తాల వైపు మరల్చెదము. ఈ రాస్తాలు వంకరటింకరగను, దుమ్ము ధూళి పోసి తయారు చేసినటులను కనబడుచుండును. ఈ రాస్తాలపై నడచు మనుష్యులకును బండ్లులాగు ఎద్దులకును యాతన కల్గుచున్నది. ఈ కారణముననే మనము బరువైన బండ్లను భారమైన చక్రములను తయారుచేయించుచున్నాము. తత్ఫలితముగ ఎద్దులు వృథాగా ఇబ్బడిబరువును మోయవలసి వచ్చుచున్నది. దుమ్ములో బండి లాగుటయే కష్టము. ఉపరి భారీబండి. రాస్తా గట్టిది — కంకరది అగుచో ఎద్దు రెట్టిబరువును లాగగలదు. బండ్లను చౌకగ గిట్టును. గ్రామస్తుల యారోగ్యమును చక్కబడును.

వర్షాకాలములో బండ్లుపోవుట దుర్ఘటమగు నంతటి నీరు బురద రోడ్లపై కాపురముండును. అడుగుతీసి అడుగు పెట్టుసరికి ప్రళయమగును. ఒక్కొక్కచోట మనుష్యులు ఈదుకొని పోవలసివచ్చును. లేదా నడుమువరకు తడుపుకొని పోవలసి వచ్చును. పైగా దీనివలన వ్యాధులు కల్గును.

గ్రామము పెంటపోగులకు సాటిగ నున్నట్టి ప్రదేశమున బావులు చెరువులు నిర్లక్ష్యము చేయబడుచున్నట్టి ప్రదేశమున ఇక్ష్వాకులనాటి బాటలతో నున్నట్టి ప్రదేశమున, బిడ్డల స్థితి మాత్రము ఏమంత బాగుండును? బిడ్డల నడవడియు, సభ్యతయు, గ్రామస్థితికి ఛాయామాత్రములుగ నుండును. గ్రామస్థ

లకు రోడ్లపై శ్రద్ధ యెక్కో బిడ్డలమీదను అంతే — ఈ విషయ మటుంచుడు. అది ప్రస్తుతాంశము గాదు.

అయితే యీ రోడ్ల నేమి చేయవలెను? ప్రజలలో సహకార భావ మున్నచో, కానిడబ్బుతో పనిలేకుండ (కంకర మొదలైనవానికి గాక) చక్కని రాతిరోడ్లను వేయవచ్చును. గ్రామ సంపదను పెంచవచ్చును. సహకారకార్యముల ద్వారా చిన్నలు పెద్దలు అందరు వాస్తవమైన విద్యను ఉచితముగ పొందగలరు.

ఈపని సాధ్యమైనంతవరకు కూలిలేకుండగ నెరవేరునటుల చూచుకొనవలయును. గ్రామస్థులెల్లరు రైతులు గనుక తమకు తామే స్వయంకూలీలు కావలెను. అవసరమగుచో ఇరుగు పొరుగు కూలీల సాయము తీసికొనవలెను. ప్రతిదినము కొంత సమయము రోడ్లఅభివృద్ధికై వినియోగించినచో కొలది కాలములోనే చక్కని రోడ్లు ఏర్పడగలవు. ఇందుకుగాను గ్రామమందలి వీధులు, సందులు, పొరుగూరునకు పోవు రోడ్లు మొదలగు వానిని చూపు పటము గీచికొని గ్రామస్థులు తమ శక్త్యానుసారము కార్యప్రణాళిక నేర్పరచుకొనవలెను. ఈకార్య నిర్వహణములో స్త్రీలు, పురుషులు; పిన్నలు, పెద్దలు — ఎల్లరు పాల్గొనవచ్చును. నేడు మన ప్రవృత్తి కుటుంబమువరకే పరిమితమై యున్నది. ఈ కుటుంబ భావమును గ్రామపర్యంతము విస్తృతము చేయుటపైననే గ్రామసంస్కరణ మాధారపడి యున్నది. మనసభ్యతకు చిహ్నముగ మన గ్రామము లుండవలెను. మన గ్రామముల స్థితినిబట్టి మన సభ్యత ఊహింపబడుటకు వీలుకావలెను. కుటుంబములోని ప్రతిమనుష్యుడును

తనగృహమును శుభ్రముగ నుంచుటకై ఎటుల శ్రద్ధ వహించునో అటులనే ప్రతికుటుంబమును తన గ్రామ పారిశుద్ధ్యమునకై కృషిచేయ శ్రద్ధవహింపవలెను. అప్పుడు గ్రామస్థులు సుఖవంతులగుదురు; స్వావలంబకు లయ్యెదరు. ఈ దినములలో ప్రతిదానికిని ప్రభుత్వమువారి ముందు చేయి చాచుచున్నారు. ప్రభుత్వమువారే గృహములను శుభ్రముగ నుంచవలెను. రాస్తాలు వేయించవలెను. చెరువులు, బావులు సురక్షితముగ నుంచవలెను. బిడ్డలకు చదువు చెప్పింపవలెను; ఆపదలనుండి రక్షింపవలెను. ఆస్తిపాస్తులను కాపాడవలెను. ఈవిధముగ మనము ప్రభుత్వముపై వృధాగా పెద్దభారము వేయుచున్నాము. ఈ భావమే - అన్నిటిని ప్రభుత్వమే చూడవలెనను భావమే మనలను కుంటి గ్రుడ్డి వారిగను, వికలాంగులుగను చేసివైచినది. అంతేగాదు; ఈభావము నానాటికి పెరిగి పోవుచున్నది. గ్రామసౌందర్యమును, పారిశుద్ధ్యమును, రక్షణమును, తమ బాధ్యతయే యని గ్రామస్తులు నమ్మిచో గ్రామోద్ధరణ కార్యము చాలభాగము డబ్బు దస్కము లేకుండగనే జరిగి పోగలదు. ఇంతేగాక రాకపోకల సౌకర్యములను, ఆరోగ్యమును అభివృద్ధి యగుటవలన గ్రామ ఆర్థికస్థితియు చక్కబడును.

రోడ్లను శుభ్రముగ నుంచుటలో మొదడు కొంచెము ఉపయోగింపవలసిన యవసరమున్నది. గ్రామ రాస్తాల సంగతి ఇదివరకే చెప్పియున్నాను. కంకరరోడ్లను - మంచి రోడ్లను వేయుటలో అన్ని గ్రామములకు ఒకేవిధమైన సౌకర్యము

లుండవు. కొన్ని ప్రాంతములందు కంకర దొరకును. మరికొన్ని ప్రాంతములందు ఇటుకరాతి ముక్కలతోనే పని ముగించుకొనవలసి వచ్చును. కంకరరోడ్లను, రాతిరోడ్లను నిర్మించు నుపాయము నిర్ణయించుట ఈ వ్యాసములలో పేర్కొనబడుచున్న గ్రామసేవకునిదే. గ్రామసేవకుడు చుట్టుపట్ల ప్రదేశములందు తిరిగి చూడవలెను. సర్కారువారు రోడ్లనువేయు పద్ధతిని గమనింపవలెను. అందు నేర్చుకొనతగిన దేదైన యుండుచో దానిని స్వీకరింపవలెను. గ్రామపెద్దలలో కొందరు ఈ రోడ్ల విషయమై మంచి వ్యవహారజ్ఞానమున్నవారుందురు. అట్టివారిని వెదకి కనుగొనుటకును, వారివలన లాభము పొందుటకును గ్రామసేవకుడు సంకోచింపరాదు. ఇతరవిషయములందువలెనే యిందును గ్రామసేవకుడు స్వయంశ్రమమును ఆదర్శముగ నిడుకొని గట్టిరోడ్లను వేయుట నారంభింపవలెను.

## 8. రైతుల అభ్యుదయము

రైతులస్థితిని విద్యావంతులు విచారింప నంతవరకు దానిని తెలిసికొని అనుభవము చేసికొన నంతవరకును రైతాంగము బాగుపడుట సంభవము కాజాలదు.

మననాయకులు రైతులస్థితినిగూర్చి కొంతజ్ఞానము సంపాదించినారు; కొంతమటుకు వ్రాసిరి. కొన్నిస్థళ్ళలో రైతులస్థితిని గూర్చి చర్చకూడ జరిగినది. అయినను వారికి రైతులనుగురించిన స్వానుభవము లేకపోవుటచే రైతులు అభివృద్ధి చెందలేదు.

ప్రభుత్వోద్యోగులు రైతులస్థితిని గ్రహించిరి. కాని వాస్తవముగ ఆయుద్యోగిస్థితి జాలికరమైనది. ఏమనగా అతను శాసకుని దృష్టితో శిస్తు వసూలుచేయు యధికారి దృష్టితో రైతును పరికించినాడు. అధికాధికమైన శిస్తువేయు నధికారికిని, అటుల వసూలుచేయు నధికారికిని జీతములోను, పదవిలోను అభివృద్ధి లభించుచున్నది. బిరుదులును అతనికే లభించుచున్నవి. అతడే ప్రజ్ఞావంతుడుగ పరిగణింపబడుచున్నాడు. మనమొక వస్తువును ఏ దృక్పథముతో పరిశీలించెదమో ఆవస్తువు మనకు ఆదృష్టితోనే కనబడును. కనుక మనము రైతును రైతుదృష్టితో ఎంతవరకు పరీక్షింపమో అంతవరకు అతని యదార్థస్థితి స్పష్టముగ గోచరింపదు.

అయినను రైతాంగస్థితిని కొంతవరకు నూహింపవచ్చును. హిందూదేశము పేదదేశము. లక్షలకొలది హైందవులు ఒక పూటమాత్రమే భోజనముచేయగల్గుచున్నారు. అనగా భారతదేశపురైతు పేదవాడని దీనియర్థము. వీరిలో చాలమందికి ఒక పూటమాత్రమే తిండి లభించుచున్నది. రైతు అనగా ఎవరు? వందలాది ఎకరములున్నవాడును రైతే. ఒక ఎకరమున్నవాడును రైతే. సెంటుభూమియైనను లేక ఇతరులభూమిలో "పాలికి" చాకిరిచేసికొని జీవించువాడును రైతే. ఇంతేగాక షాహుకార్లకును తమవారికిని నిత్యము కేవలము వెట్టిచాకిరిచేసి జీవించు వేలకొలది రైతులు చంపారనము (బీహారు)లో చూచినాను. వివిధరకములుగనున్న ఈ రైతులలెక్క మనకెన్నటికిని లభించుపట్టిదికాదు. జనాభలెక్క పద్ధతియు గలదు. రైతుల స్థితిగతుల

తెలిసికొనుటకై జనాభా లెక్కను రైతుల స్థితిగతుల లెక్కగ మార్చినచో మనల నాశ్చర్యచకితులుగను లజ్జచే తలవంచుకొను వారినిగను చేయునట్టి విషయములు బయటికివచ్చును. రైతుల స్థితి బాగుపరచుమాట అటుండగా దినదినము వారిస్థితి హీనమై పోవుచున్నది. గుజరాతులోని ఖేడా జిల్లా విషయము చెప్పె దను. అచట యింతకల్గిన రైతులని చెప్పబడువారును తాము కట్టుకొన్న చక్కని భవనములను వెల్లవేయించుటకును శక్తి సామర్థ్యములు లేనివారై యున్నారు. విశ్వాసమును చూరకొను గల తేజస్సు సహితము వారి ముఖమునుండి అదృశ్యమై పోయి నది. శరీరములందు తగినంత దార్ఢ్యమే కనబడదు. పిల్లలు చూడగా బక్కచిక్కి యున్నారు. గ్రామములో ప్లేగువ్యాధి పాదుకొన్నది. ఇతర వ్యాధులును ప్రజలను పీడించుచున్నవి. పెద్ద పెద్ద రైతులు ఋణభారములతో కృంగియున్నారు. మద్రాసు రాష్ట్రమున గ్రామములకు వెళ్ళుడు. కంపించిపోవు దురు. ఖేడ, చంపారణ్ జిల్లాలలో ఉన్నంత గంభీర అనుభ వము మద్రాసురాష్ట్రములో నాకు లేకున్నను, నేనింతవరకు మాత్రము గట్టిగ చెప్పగలను: మద్రాసురాష్ట్రమున నేను చూచిన గ్రామములస్థితి ఆ రాష్ట్రపు దారిద్ర్యము నూహించు టకు తోడ్పడుచున్నది.

హిందూదేశమున కిది ఒక గొప్ప సమస్య. ఈ సమస్య పరిష్కారమగు విధమెద్ది? రైతుల స్థితి బాగుపడుట యెట్లు? వీనిని గూర్చి అనుభవము యోచింపవలెను. భారతదేశము పట్టణ ములలో లేదు. భారతదేశమనగా పల్లెటూళ్లు, బొంబాయి,

కలకత్తా, మద్రాసు మొదలైన గొప్ప గొప్ప పట్టణముల జన సంఖ్యనంతటిని కలిపినను ఒక కోటి కాజాలదు. భారతదేశము నందలి మంచి పట్టణము లన్నింటిని కలిపి లెక్కించినను, నూటికి లోపలిమాటే. కాని, నూరు మొదలు వెయ్యి వరకు జనాభాగల గ్రామముల సంఖ్యకు అంతులేదు. అందుచేతనే పట్టణములు మంచిస్థితి కల్గియున్నను, అవి బాగుపడినను కూడ వాని పలుకుబడి, ప్రధానము గ్రామములపై యెక్కువగ ప్రస రింపజాలదు. నదియొడ్డున ఒకగోతిని శుభ్రపరచినంతమాత్ర మున, నది పైభాగమునున్న కల్మషము ఏమాత్రము తొలగి పోజాలదు. పట్టణముల గ్రామముల స్థితియును అంతే. కాని అట్టి నదిని పరిశుద్ధము చేయుటవలన నదియొడ్డున అచటచట గల గోతులలోని నీరు ఎటుల శుభ్రపడునో అటులనే భారతదేశ మందలి గ్రామములను బాగుపరచినచో - గ్రామజీవనమును వికసింపజేసినచో, మిగిలిన సంస్కరణమంతయు దానియంత టదియే జరిగిపోవును.

ఈ స్థితిని చక్కబరచు విధమును, అందుకై చిన్నలు, పెద్దలు అందరు చేయూతనీయగల్గిన విధమును, సత్యము స్వీక రించి తమ కర్తవ్యమును నిర్వర్తించుకొనుచు పోవునట్టి సిపా యీలు మనలోనుండి కొద్దిమంది ముందుకువచ్చినను, కొలది కాలములో మనమొంతె పురోగమింపగల్గినదియు ముందు ప్రక రణములో వివరింతును.

లక్నో కాంగ్రెసు సమయమున ప్రసిద్ధి వహించిన శ్రీ లయోనల్ కార్టిస్ ఒకచోట భారతదేశము నీవిధముగ చిత్రించినాడు.

"హిందూదేశమనగా పెంటపోగుల కుప్ప. గుడిసెలు, పాడుపడిపోయిన ఊళ్ళను మించియున్నవి. ప్రజలలో శక్తి నశించినది. ఆలయములు ముక్కు ముఖము లేకుండ యున్నవి. శుభ్రత అనునది గ్రామము లందు వెదకినను కానరాదు. రోడ్లు వీలు చాలు లేకుండ యుండి దుమ్ము ధూళితో నిండియుండును. గ్రామములు చూడగనే వానియందు ఒక కట్టుబాటు – ఒక వ్యవస్థ లేనటుల కనిపించును. ఇందతిశయోక్తి ఏమియు లేదు. విశేషము : కొంతవరకు మనము అభివృద్ధి చెందుటకు అవకాశమున్నది. సువ్యవస్థితమగు గ్రామ నిర్మాణములో ఒక నియమ ముండవలెను. గ్రామమందలి వీధులు ఇచ్చవచ్చిన రీతిని కాకుండ, ఒకతీరును ఒక ఆకారమును గలవిగా నుండవలెను. మన దేశములో కోట్లాది ప్రజలు ఒట్టిపాదములతో నడచుచుందురు. అట్టియెడ మనుష్యులు నడచుటకేకాదు; పండుకొనుటకును సంకోచము కలుగనంతటి పరిశుభ్రముగ నుండవలెను. వీధులు గట్టిరోడ్లతోను (కంకరరోడ్లతో) మురికినీరు పోవుటకై తగిన సైడు కాల్వలతో అమరియుండవలెను. మసీదులు, దేవాలయములు పరిశుభ్రముగను, స్వచ్ఛముగను, ఇప్పుడే కట్టబడినటులను ఉండవలయును. అందు ప్రవేశించువానికి శాంతి పవిత్రత గోచరమగుచుండ

వలెను. గ్రామమందును, చుట్టు ప్రక్కలను ఉపయోగకరమై నట్టియు, పండ్లు కాయునట్టియు, వృక్షజాలమును పెంచవలెను. గ్రామమునకు అనుబంధముగ నొక సత్రశాలయు, రోగులకు చికిత్స నిమిత్తమై ఒకచిన్న ఉపచార గృహమును ఉండవలెను. గ్రామమునందు నీరు, గాలి, రోడ్లు మొదలైనవి చెడకుండు నటుల తగిన కట్టుదిట్టము లుండవలెను. తన అన్నమును వస్త్రమును తన గ్రామమందే తయారుచేసికొనుటకు ప్రతిగ్రామస్థుడు శక్తిమంతుడై యుండవలెను. చోరులను, భటాచోరులను, సింహము మొదలైన క్రూరమృగముల నెదిర్చి తన్ను దాను రక్షించుకొనగల శక్తి గ్రామస్థుల కుండవలెను. ఒకప్పుడిట్టి యున్నతస్థితి చాలవరకు గ్రామస్థులలో యుండెడిది. ఒక వేళ ఏ యుత్తమ శక్తియైనను పూర్వము లేకుండినచో అది ఆ కాలమున అవసరమై యుండి యుండెడిది కాదు. ఏది యెటు లున్నను, పైన జెప్పిన స్థితి నేడు గ్రామస్థులం దుండవలెను. ఈ విషయము నెవరును శంకింపరాదు. ఇట్టి గ్రామమునే స్వావలంబనమని చెప్పవచ్చును. భారతదేశమునందలి గ్రామములన్నియు ఇట్టి యుత్తమస్థితికి రాగల్గినచో భారతదేశ దుఃఖభారము చాలవరకు తీరినదనియే చెప్పనగును.

ఇట్టి స్థితిని దెచ్చుట అసంభవ మేమియు గాదు. ఈ సంస్కరణము మనము తలపోయుచున్నంత కష్టమును గాదు. భారతదేశమున ఏడున్నర లక్షల గ్రామము లున్నవని చెప్పుచున్నారు. సగటున గ్రామమునకు నాలుగువందల మంది జను లుందురు. చాల గ్రామములలో వెయ్యికి లోపలనే యుందురు.

ఇట్టి చిన్న పల్లెలలో చక్కని వ్యవస్థ కట్టుబాటు ఏర్పరచుట మిక్కిలి సులభమని నా దృఢవిశ్వాసము. ఇందుకు గొప్ప యుపన్యాసములుగాని, కౌన్సిలు రూల్సుగాని అవసరము లేదు. ఒకటిమాత్రము అవసరము; అదేమనగా ఒకచేతి వ్రేళ్ళపై లెక్కింప దగినంతమంది నిష్కలంక సేవాపరులగు స్త్రీ పురుషులు తమ ఆచరణము సేవాభావము మూలమున ప్రతి గ్రామమునందును వారు తేవలసినంత మార్పు తీసుకొని రాగలరు. వారు దీనికై రేయింబవళ్ళు పనిచేయవలయునన్న మాటకూడ లేదు. తమ జీవనోపాధిని చూచుకొనుచునే తమ సేవావృత్తి కారణముగ గ్రామములో మహత్వపూర్ణమైన మార్పును తీసికొనిరాగలరు.

ఇట్టి సేవకులకు పెద్దపెద్ద చదువులేమియు నవసరము లేదు. అక్షరజ్ఞాన మేమియు లేకున్నను గ్రామోద్ధరణ కార్యము జరిగి పోగలదు. ఇందుకు ప్రభుత్వమువారుగాని మరేరాజులుగాని ఆటంకపడుదురను విషయమేమియు లేదు. వారి సాహాయ్యమును అంతగా అవసరము లేదు. ప్రతి గ్రామమునుండియు ఇట్టి సేవకులు ముందుకువచ్చినచో ఏ యాడంబరమును ఏ యాందోళనమును లేకుండగనే భారతదేశమంతటను పని జరిగిపోవును. కొద్ది ప్రయత్నముల వలననే, ఊహింపరాని గొప్ప ఫలితములు కలుగును. ఇందుకు డబ్బుకూడ అవసరములేదని పాఠకుడు సులభముగ తెలిసికొనగలడు. కావలసిన దేమనగా సదాచారము – ధర్మ ప్రవృత్తి.

రైతుల అభివృద్ధికి ఇది అత్యంత సులభమార్గమని అనుభవ పూర్వకముగా నే నెరుగుదును. ఈ విషయమున ఒక గ్రామము మరియొక గ్రామముకొఱకై వేచియుండవలసిన యవసర మేమియులేదు. ప్రజాసేన చేయవలెనను నిష్కళంక భావముగల పురుషుడుగాని స్త్రీగాని ఒక్కరున్నను, వారు వెంటనే కార్య మారంభింపవచ్చును. ఆ సేవలో యావద్భారత సేవయు నిమిడి యున్నది. దీనిని చదువు గ్రామస్థులు నేను తెలిపిన ప్రయోగ ములను ఆరంభించెద రనియు, కొలది కాలములోనే తమ ప్రయోగ పరిణామములను దేశమునకు చూపెదరనియు నేను విశ్వసించు చున్నాను.

ఇచ్చట యీ ప్రయోగములకై నాఅనుభవముల కొన్నిం టిని తెలుపగోరుచున్నాను. చంపారనములో స్వయంసహాయ (స్వావలంబీ) పాఠశాలలు స్థాపించుటకు నిశ్చయమైన పిమ్మట నాకు స్వయంసేవకులు కావలెనంటిని. ఆ సమయమున వచ్చిన స్వయంసేవకులలో స్వర్గీయ డా॥ దేవుగారును, బెల్గాం వకీలైన శ్రీ సోమణ్ గారును ఉండిరి. వీరు ముఖ్యముగ మూడుపనులు చేయవలసి యుండిరి. వచ్చిన బాలబాలికలకు చదువుచెప్పుట; పరిసరములలోని యిండ్లు, రోడ్లు మొదలైనవానిని శుభ్రముగ నుంచుట, గ్రామస్థుల కవి నేర్పుట, తెలియజెప్పుట; వచ్చిన రోగులకు ఔషధము లిచ్చుట. డా. దేవుగారు పాఠశాలయున్న గ్రామములో వైద్యవిషయము చూచుచుండిరి. వీరి డేరా "భతిర్వా"లో ఉండెను. అచటి ప్రజలకు గ్రామోద్ధరణ సంస్క రణ విషయములు చెప్పుట దుష్కరముగా నుండెను. డా. దేవు

వారికి సంస్కరణ వివరణమును ప్రజలకు వివరించి చెప్పిరి. రోడ్లు శుభ్రముచేయుట, బావులచుట్టు ఏటవాలుచేయుట, బురదను తొలగించుట—ఇది విషయము. కాని గ్రామస్థులు డా. దేవుగారు చెప్పినది వినుకొందురా? కడకు డా. దేవుగారును, సోమణ్ గారును చేత పారలుబట్టి బావిచుట్టు ఏటవాలు చేయుటను, రోడ్లను శుభ్రముచేయుట నారంభించిరి. గ్రామము చిన్నదాయెను. ఈవార్త గ్రామమంతటను విద్యుత్తులాగ వ్యాపించెను. గ్రామస్థులు డా. దేవుగారు చెప్పినదాని యర్థమును ఇప్పుడు తెలిసికొనగల్గిరి. డా. దేవుగారికి పనిలోనున్న బలము బోధించుటలో లేదు. గ్రామస్థులు స్వయముగా బాగుచేయుటకు బయలుదేరిరి. నాటినుండి భతిర్వా బావి, రోడ్లు సుందరముగా కనుపింపసాగినవి. పెంటకుప్పలు మాయమయ్యెను. ఇంతలో ఎవ్వడో దుష్టుడు గడ్డితో కప్పబడిన పాఠశాలను నాశనము చేసెను. ఇప్పుడేమిచేయవలెనను ప్రశ్న యుదయించెను. మరల పూరితోనే కప్పి పరశురామప్రీతికి సిద్ధపడవలెనా? శ్రీ సోమణ్, డా. దేవుగార్లు సున్నము, రాయితో పాఠశాలా భవనము కట్టుటకు నిశ్చయించిరి. అప్పటికి వారిద్దరకు ఉపన్యాసకళ వచ్చియుండెను. సామాను బిచ్చమెత్తిరి. అవసరమైన చోట డబ్బును ఇచ్చిరి. ఇద్దరు కాయకష్టముచేయ నారంభించిరి. సున్నపుకట్టడమునకు బునాదు వారి చేతులతోనే వేసిరి. గ్రామస్థులు అపుడు వచ్చిపడిరి. శిల్పులు, పనివాండ్రు యథాశక్తిగ తోడ్పడసాగిరి. ఒకరిద్దరు మనుష్యులు నిశ్చయించి ఆరంభించినచో కార్యమును ముగించలేరా అను ప్రశ్నకు

జవాబిచ్చుటకై భతిర్వాలోని పాఠశాల నేటికిని నిలిచియున్నది. ఈ విధమైన పని ఒక్క గ్రామములోనే గాదు. పాఠశాలలు తెరచిన ప్రతి ప్రదేశమందును అధిక పరిమాణములో జరిగినది. ఉపదేశికుల ఉపాధ్యాయుల కార్యనిర్వహణములోగల ఆకర్షణ శక్తి ననుసరించి గ్రామస్థులు పనిలో వచ్చిపడుచుండిరి. ఈ సేనాకార్యములో అవసరమైనది తెలివితేటల బండారముగాదు. ప్రేమ, అనురక్తి గావలెను. ఆసక్తి అనురక్తి యున్నచో, తెలివి, శిల్పము మొదలైనవి ఇతరులనుండి లభించుచుండెను.

ఖేడాజిల్లాలో పంట అంచనా వేయవలసివచ్చెను. రైతుల సహకారము లేనిదే ఆపని పూర్తియగు అవకాశము లేకుండెను. ఒక్కొక్క గ్రామమును గూర్చి ఒక్కొక్క సేవకుడు అవసరమైన సూచనలు గ్రహించెను. అంతేగాక, తన సత్ప్రవర్తనమూలమున రైతుల హృదయము నాకర్షించెను. భిన్నభిన్న స్థానములలో జరిగిన ఇట్టి యనేక యుదాహరణము లీయగలను. ఇప్పుడు మనకు ముందు పనిముఖము అంతుపట్ట వలెను. గ్రామమును సువ్యవస్థితము చేయగోరువాడు తాను నివసించు వీధిని ప్రేమించును. ఆ వీధిని నివసించుచున్న వారి నెల్ల నతడు గుర్తించును. ఏ కృత్రిమమును ఏ నటనయు లేకుండగనే వారి కష్టములలో పాల్గొనును. వీధి పారిశుద్ధ్యమున వారిసాయమును కోరును. ఇరుగు పొరుగువారు మొదట అపహాస్యము చేసెదరు. అవమానమును చేయుదురు. కాని యిదియంతయు గ్రామసేవకుడు సహించును. మునుపటి వలెనే వారి కష్టములలో భాగము పంచుకొనును. తాను

ఒంటరిగ వీధిని బాగుచేయును. తనభార్య, తల్లి మొదలైన వారి నుండి క్రమ క్రమముగా ఈ పనియందు సాయము గోరును. పొరుగువారు సాయపడినను పడకున్నను వీధిమాత్రము శుభ్రముగ ఉండుచుండును. ఈ విధముగ ఈపని ఎక్కువకాలపు పని కాదని అనుభవముమీాద తెలియును. కడకు పొరుగు గృహస్థుడు స్వయముగ పారిశుద్ధ్యకార్యమును చేయ నారభించును. ఒకవీధి సుగంధము మరియొక వీధికి వ్యాపించును.

ఇట్టి గ్రామసేవకునకు ఇంకను ఎక్కువ పనిచేయవలెనను ఉత్కటప్రేమ యుండుచో, తాను చక్కగా చదువుకొన్నవాడైనయెడల, తన వీధియందున్న నిరక్షరులగు చిన్నలను పెద్దలను చేర్చి వారికి అక్షరజ్ఞానము కలుగజేయనచ్చును. తన వీధిలో ఎవరైన వ్యాధిగ్రస్తులై యుండి డబ్బులేమిచే మందుమాకులు వారికి అందకుండినచో, అట్టివారికి పరోపకారియైన వైద్యుని పట్టుకొనివచ్చును. రోగికి సేవచేయువా రెవరును లేనిపక్షమున తానే వారి కుపచారము చేయును. దీనిమూలమున ప్రతి గృహస్థుని ఆర్థిక నైతిక స్థితిగతుల విషయము మంచి యెరుక గలుగును. అప్పుడచట ఏ సంస్కరణ జరుగుట కవకాశ ముండునో ఆ గ్రామసేవకుడు ఆ సంస్కరణప్రణాళిక తయారు చేయును. ఈవిధముగ సంస్కరణ చేయుచు తన పొరుగు వారి యొక్కయు తన్మూలనమున యావత్తు గ్రామము యొక్కయు రాజకీయస్థితి అంచనా లభించును. ఈ యంచనాతో పాటు ప్రజలకు ఏకత్రితముచేసి నడిపించు శక్తియున్నచో ఆ గ్రామసేవకుడు రాజనైతికస్థితిని చక్కబరచుటలోకూడ సమ

ర్థుడు కాగలడు. ఆఫ్రికా, చంపారన్, ఖేడా మొదలగు ప్రదేశములను నేను చూచియున్నాను. అచట చదువురాని వారు అని చెప్పబడువారు ప్రేమచేతను, పరోపకారబుద్ధిచేతను మంచి సేవచేసిరి. జనసముదాయముపై మంచి ప్రభావము కలుగజేసిరి. ఆయా గ్రామములలో నేను చూచినట్టి వివేకులగు ప్రతి స్త్రీ, ప్రతి పురుషుడును మంచిసేవ చేయుచుండిరి.

ఇకనుమనము స్వచ్ఛత, నైతిక, శారీరక, ఆర్థిక, ఆరోగ్య నియమములను విచారించెదము. ఎవరి కీనియమములు నచ్చునో వారు తమ గ్రామములో ఈ నియమానుసారముగ పనిచేయుదురని యాశించుచున్నాను. ఈమాత్రము చేయుచో కొలది కాలములో ఎన్నో గ్రామముల స్థితి బాగుపడుటకు శక్తిని తేజస్సును ఈయగలరు.

స్థితిగతులు పరిశీలించితిమి. గ్రామములందలి జనులు పరిశుభ్రతా నియమములను పాటింపకుండుటయు చూచినాము. "ఆరోగ్యముగల శరీరమునకే మొదటి సుఖము" అను సామెతలో ఎంతో సత్యమున్నది. చాల యున్నతస్థితికి పోయిన స్త్రీ పురుషులు రోగపీడితులయ్యేను, తమస్థితిని సంబాళించుకొనగల రేమోగాని, ఇంకను ఉన్నతస్థితికి చేరవలసియున్న మనము జబ్బుపడినచో ఉన్నతస్థితికి పోజాలము.

"శీతలపాదములతో స్వర్గము లెవరు చేరజాలరు" అని యింగ్లీషులో నొకసామెత గలదు. ఇంగ్లాండువంటి శీతలదేశములో పాదములు చల్లగానున్నచో చాల హైరాను అయ్యెదరు. ఈశ్వరుడును స్మరణకు రాడు. "పరిశుభ్రత దైవస్థితికి

సమాన"మని సామెత యొకటి గలదు. మనము మురికిగానుండుటకుగాని, మలినపరిస్థితిలో నుండుటకుగాని హేతువేమియు లేదు. మాలిన్యములో పవిత్రత యుండదు. అజ్ఞానమునకును, సోమరితనమునకును మాలిన్యము చిహ్నము. దీనినుండి రైతును ఉద్ధరించుటెట్లు? పారిశుద్ధ్య నియమములను పరిశీలింతము.

మనకు సంభవించు వ్యాధులలో చాలభాగము మన మలవిసర్జనమునకును బహిర్దేశమునకును సంబంధించి యున్నవి. ఆరోగ్యవంతులును వయోజనులును మాత్రమే మలవిసర్జనకై ఊరువెలుపలకు వెళ్ళగలరు; ఇతరులు పాయిఖానాదొడ్లు లేనప్పుడు, సైడుకాల్వలలోను, సందులలోను, ఇంటి యావరణయందును మలవిసర్జనచేసి నేలను పాడుచేయుచున్నారు. వాయువును విషపూరితము చేయుచున్నారు. ఇందుకు మనము రెండు నియమములను చేసికొనవచ్చును. బహిర్దేశమునకు వెళ్లుచో ఊరుదాటి ఒకమైలు వెళ్ళవలెను. అచట పల్లెలేమియు నుండరాదు. మనుష్యుల రాకపోక లుండరాదు. పొలమువైపున మలవిసర్జన చేయుటకు ఒకగోయి త్రవ్వవలెను. అందు మలవిసర్జనమైనపిమ్మట దానిపై మట్టిని చల్లవలెను. త్రవ్వినమట్టి నంతటిని దానిపై కప్పినచో మలము చక్కగా మరుగుపడి పూడిపోవును. ఈ స్వల్ప శ్రమతో పారిశుద్ధ్యముయొక్క గొప్ప నియమమును పాలించగలము. బుద్ధిశాలియైన రైతు తనపొలమందే మలవిసర్జన చేయవలయును. అది అతని పొలమునకు ఎరువగు.

మలవిసర్జనమునకై ఊరివెలుపలకు వెళ్ళినను, ఇంటియందొక పాయిఖానాదొడ్డి యుండుట అవసరము. అందుకు ఒక

చిన్నతొట్టి లేక బొక్కెనైన యుపయోగించుట మంచిది. అందులో మలవిసర్జన చేసినపిమ్మట దానిపై మట్టిని చల్లవలెను. అందు వలన ఈగలు ముసరవు. పురుగులు పడవు. ఈ తొట్టిని లేక బొక్కెనను నియమపూర్వకముగా శుభ్రము చేయుచుండవలెను. మిషనుతో భూమిలోనికి రంధ్రముగొట్టి ఏర్పరచిన బోరింగు పాయిఖానా నిష్ప్రయోజనము. భూతలమునుండి - భూమిపై నుండి ఒక అడుగులోతునకు లోపున ఒకవిధమైన క్రిములుండును. ఇవి ఈపెంటను వెంటనే ఎరువుగ మార్చివేయును. మిక్కిలి లోతుగ పూడ్చబడిన పెంట ఒకవిధమైన మాలిన్యముతో కూడిన గ్యాసును ఉత్పత్తిచేయును. వాయువును చెడగొట్టును. మట్టితొట్టి కాని లేక యినుపబొక్కెనగాని యుపయోగింపవచ్చును. దీనికిని డబ్బు అంతగా అవసరములేదు. పరిశ్రమమాత్రము అవసరము. మూత్రమునైనను ఎచ్చట బట్టిన అచ్చట విడవరాదు. వీధులలో మూత్రము విసర్జించుట పాపముగ నెంచవలెను. మూత్రము విడుచుటకును ఒక బొక్కెన యుండవలెను. అందు మూత్రించిన వెంటనే దానిపై మన్ను చల్లవలెను. దుర్వాసన రాదు. తుంపురులు పడరాదు. మరియు ఈ మట్టిని తమచేనికి ఎరువుగా మార్చవచ్చును. ఈ నియమములను ప్రతి రైతు జాగ్రత్తగ పాలించినచో ఆతని యారోగ్యము అభివృద్ధి చెందును. ఆతని అసలు స్థితియు బాగుపడును. ఎందుచేత ననగా బంగారమువంటి ఎరువు అతనికి లభించుచున్నది.

వీధులలోను, సందులలోను ఉమ్మివేయరాదు. చీదరాదు. అనేకుల ఉమ్మి క్షయరోగములను సహితము పుట్టించు నంతటి

విషతుల్యమై యుండును. వీధులలో ఉమ్మివేయుట అనేక దేశములలో అపరాధముగా ఎంచబడుచున్నది. తాంబూలము, పొగాకు వేసికొని ఉమ్మివేయరాదు. వారు ఇతరుల భావమును లక్ష్యపెట్టనే పెట్టరు. ఉమ్మి చీమిడి మొదలైనవాని పైనను మట్టివేయవలెను.

నీరు త్రాగు విషయమున రైతులు చాల అశ్రద్ధగ ఉన్నారు. పంటకును త్రాగుటకును నీరు ఉపయోగించుకొను బావులు చెరువులు పరిశుభ్రముగ నుండవలెను. వానిలో ఆకు అలము పడరాదు. త్రాగు నీటిలో స్నానము చేయరాదు. పశువులను కడుగరాదు; వస్త్రముల నుతుకరాదు. ఇందును మొదట స్వల్ప శ్రమతో కూడిన పనియే. బావిని శుభ్రముగ నుంచుట సులభము. చెరువును శుభ్రముగ నుంచుట దాని కంటె కష్టతరమే. కాని ప్రజలు నేర్చుకొనినచో అంతయు సులభమే. చెడ్డ మురికినీరు త్రాగుటకు అసహ్యమైనపుడు నీటిని పరిశుభ్రముగ నుంచు నియమములు సులభముగనే పాలింపగలరు. ఈ నీటిని ఎల్లప్పుడు దళసరి నేతగల గుడ్డతో వడబోసి త్రాగవలెను.

ఒక ముసలమ్మ ఒక టేబులు శుభ్రము చేయుచుండెను. సబ్బుతో కడుగుచుండెను. కాని అలుకుగుడ్డ పెట్టి తుడుచుచుండెను. ఎంతసేపటికిని టేబులు శుభ్రపడకుండెను. ఆ వృద్ధురాలు త్రిప్పి కూడ రుద్దుచుండెను. అలుకు గుడ్డయు మార్చి (మరియొక వైపు త్రిప్పి) తుడుచుచుండెను. కాని టేబులు యథావిధిగ మురికిగనే యుండి పోవుచుండెను. అక్కడ ఉండి

చూచుచున్న వారిలో ఒకడు "అవ్వా! అటుకగుడ్డ పారవేసి మరేదైనా మంచిగుడ్డ చూడు. లేబులు ఇప్పుడే శుభ్రము కాగలదు" అని పలికెను. ముసలమ్మకు అప్పుడు తెలివి వచ్చెను. అటులనే నీరు మురికిగుడ్డలో వడబోయుట కంటె అసలు వడబోయకుండుటే మేలు.

గల్లీలలోను, వీథులలోను పెంట వేయరాదని బోధింప వలసిన అవసరముండరాదు. ఈ కచ్మలము ఉంచుటకును ఒక శాస్త్రమున్నది. గాజుముక్కలు, రాతిముక్కలు మొదలైనవి చాలలోతుగ పూడ్చవలెను. కొయ్యముక్కలు, పుల్లలు మొదలైనవానిని కడిగి యెండించి వంటచెరకుగా నుపయోగింప వలెను. పాతగుడ్డల ముక్కలు అమ్మివేయవలెను. ఇవి కాగితములు చేయుట కుపయోగపడును. ఎంగిలి కూరముక్కలు మొదలైనవి భూమిలో పూడ్చినచో చక్కని యెరువగును. గ్రామములో పెంటపోగులు ఎత్తివేయుటకు వేరుగ మనిషి అవసరముండరాదు. ఎందుచేతననగా అచట పెంట తక్కువగా నుండును. అ ఉన్నదియు ముఖ్యముగ ఎరువున కుపయోగ పడునట్టిదై యున్నది.

గ్రామము ప్రక్కనేమి, ఇండ్లప్రక్కనేమి, నీరు నిలుచు గుంటలుండరాదు. నీరు నిల్వయుండని ప్రదేశములందు దోమ పుట్టదు. దోమలు లేనిచోట మలేరియా తక్కువగ నుండును. ఢిల్లీకి చుట్టుప్రక్కల నీరు నిల్వయుంటూ ఉండెడిది. అప్పుడు దోమ లధికముగ నుంటూ ఉండెడివి. ఇప్పుడవి అన్నియు పూడ్చినారు. దోమలు తగ్గినవి. మలేరియకూడ తగ్గిపోయినది.

ఈ వ్యాసము పరిశుభ్రతా నియమములతో నిండి పోయినదని ఎవరును ఆక్షేపింపకుందురుగాక. ఈ నియమపాలన మీదనే 25 కోట్ల రైతుల ఆరోగ్యము ఆధారపడి యున్నది.

తన గ్రామరైతులకు ఈ నియమములను తెలుపు స్వయంసేవకుడు తన గ్రామస్థుల ఆయువును పెంచినవాడగును. రోగములను నివారించు మహోపాయములను వారిచేతికిచ్చిన వాడగును. ఎందుచేతననగా, ఇందున్న స్వారస్యము గ్రహించు వారు మిక్కిలి కొద్దిమంది. అయినను ఈ పని యేనాటి కైనను చేయవలసియే యుండును. ఈ ధర్మమును పాలించుటలో పొరబాటునకు అవకాశము లేదు. ఈ ధర్మము నెంత పాలించిన అంతఫలము దక్కును. చేయదలచినవారు పనిని ఆరంభించినచో ఒక సంవత్సరములో గ్రామారోగ్యమును అభివృద్ధి పరచగలరు.

# 9. గ్రామ సేవ

ఉపవాసమునకు పిమ్మట మంచముమీద ఉండుచు మహాత్మపూర్ణ కార్యములగూర్చి శ్రద్ధతీసికొన నారంభించెను. గుజరాతు విద్యాపీఠమునకు చెందిన కొందరు కార్యకర్తలు విద్యాపీఠభవిష్యత్కార్యక్రమమును గురించి ముచ్చటించుటకై వారు వచ్చియుండిరి. ఆ సంభాషణ గ్రామసేవకును, హరిజన కార్యకలాపమునకును సంబంధించి యుండుటచే దాని సారాంశమును సంక్షేపముగ ఈ క్రింద పొందుపరచుచున్నాను:

# సంచార విద్యాపీఠము

విద్యాపీఠము యొక్క నిజమైన 'సేవ గ్రామములందే యున్నదని నేను మొదటినుండి విశ్వసించుచుంటిని. ఆ విధము గనే చెప్పుచు వచ్చుచుంటిని, కాని యీ కార్యము ఏదో యొక కేంద్ర సంస్థ ద్వారా నిర్వహింపగలమను ఊహతోనే మన మింతవరకు ఈ పనిని నడుపుచుంటిమి. మన మొక అడుగు పోవలెనన్న విద్యాపీఠము గ్రామములందే స్థిరపడవల యునని చెప్పుచున్నాను. గ్రామములందు విద్యాపీఠము స్థిర పడవలయు నన్నప్పుడు నా యభిప్రాయమేమి ?

సత్యాగ్రహ ఆశ్రమమును బాహ్యరూపముగా మనము భగ్నపరచితి మన్నప్పుడు ఆశ్రమము యొక్క అసలు రూప మును భగ్నపరచితిమని అర్థము కాదు. ఆశ్రమవాసులు ఎచ్చటెచట ఆశ్రమ ఆదర్శాను సారముగ నడచుకొనుచుందురో అవియే ఆశ్రమములు.

ఈ దృష్టితో చూచినచో ఆశ్రమ వ్యాపకరూపము ద్యోతక మగుచున్నది. ఒక జీవిత సంస్థయందు తయారైన వ్యక్తులు తమ జీవనరంగమున ఆచరణ మూలకముగా ఆసంస్థను ప్రత్యక్షపరచవలయును. ఇదియే సంస్థ యొక్క యుద్దేశ్యము.

ఇట్టి వ్యక్తులు చాలమంది తయారైన పిమ్మట సంస్థ యొక్క మూల రూపము లేకున్నను హాని యేమియు లేదు.

ఈ విధముగా విద్యాపీఠాదర్శములను దీక్షగా గైకొన్న ట్టియు విద్యాపీఠమును మరణపర్యంతము సేవజేయు ప్రతిజ్ఞ చేసి

నట్టియు "సావిద్యాయా విముక్తయే" అను దాని రహస్యమును కనీసము అర్థము మొదలు గంభీరభావము వరకును — చక్కగా తెలిసికొన్న విద్యాపీఠ సేవకులు తాము స్వయముగా సంచార విద్యాపీఠములై గ్రామములకు వెళ్ళవలయును. అచట విద్యాపీఠాదర్శములను పాలించి ప్రజలకు వానిని నచ్చచెప్పుటకు ప్రయత్నింపవలెను.

ఈ విధముగా గ్రామమునకు వెళ్ళి నివసించి అచటి అనుభవమును సంపాదించిన పిమ్మట ఆదర్శప్రాయమైన ఒక కేంద్ర సంస్థను స్థాపింపవచ్చును. ఇది సంభవమనుటలో సందేహము లేదు. కాని, మన విద్యాపీఠము ఇట్టి విద్యాపీఠము కాకున్నది. దానికి గ్రామానుభవము లేదనియే చెప్పవచ్చును.

## రాట్నము కేంద్రబిందువు

ఇట్టి గ్రామసేవకు రాట్నమే కేంద్ర బిందువు. చరకా సందేశ ఆశయమును నేనింతవరకు అవసరమైనంత పూర్ణముగ తెలిసికొని యుండలేదు. అది స్పష్టముగ ఆకళింపు కాలేదు. కాని యీ తొమ్మిది మాసముల పర్యటనములో పరీక్షణము, చింతనము చేసిన పిమ్మట — ముఖ్యముగ దక్షిణ భారత సంచార సందర్భమున ఇది దీపమువలె స్పష్టముగ గోచరించినది. గ్రామములందు వ్యాపక, సహాయక వత్తుల రూపముననూ, దారిద్ర్య నివారణోపాయముగను రాట్నమును స్థాపించుటెట్లు అను విషయముగూర్చి చింతన చేయుచునే యున్నాను. ఈపద్ధతి రాట్నము ఇంతవరకు సాధనముకాలేదు.

గ్రామ సాలీలు రాట్నమువలననే బ్రతుకగలరు. మిల్లుయంత్రములవలన మాత్రము కాదు. ఈభావ మింకను ప్రజలు పూర్తిగ గ్రహింపలేదు. ఇప్పుడు రాట్నముపని ఎంతవరకు స్థిరపడినది? శుద్ధఖద్దరునే ధరించునట్టి ఒక వర్గము దేశమునందున్నది. వారి వస్త్రావశ్యకతను తీర్చుకొరకు కొందరు గ్రామస్థుల కిది ఒక సామాన్య వృత్తియై యున్నది. ఇప్పటి కిదియే చరఖాకున్న ప్రతిష్ఠ. కాని, ఈమాత్రపు స్వల్పభాగ్యమునకు చరఖాసంఘమువంటి విశాలసంస్థను స్థాపింప నవసరములేదు. ఖద్దరు మన రైతులకు అన్నపూర్ణాదేవివలె సాయము చేయునట్టిదని ఖద్దరు అంతర్యమునందున్న నాయూహా. ఇది లక్షలకొలది హరిజన నేతగాండ్రకు ప్రాణశక్తి. రైతులు కనీసము నాల్గుమాసములు పనిలేనివారై యుందురు. ఖాదీ వారికి పని యిచ్చుచున్నది. నేడు మనదేశమున కృషిగాని, స్వావలంబనముగాని లేదు. సోమరితనము మాత్ర మిచట లోతుగ పాదుకొనియున్నది. కృషిని, స్వావలంబనమును తిరిగి రప్పింపవలెనన్న అది కేవలము చరఖాద్వారానే సాధ్యమగును.

## రాట్నములో సామ్యవాదము

ఈ దేశములో రక్తపుటేరులు ఆగిపోవలెనన్నను, ప్రజలలో ఇతోధిక పశుత్వము రానీయకూడదన్నను, ఖద్దరుయొక్క యీ వ్యాపక సందేశమును ఈ దేశములో ప్రతి మూలకు వ్యాపింపచేయవలెను. సామ్యవాదమను పేరుతో నేడు వినవచ్చుచున్నది వాస్తవిక సామ్యవాదము కాదు. భారతదేశము జీర్ణించుకొనగల సామ్యవాదము శ్రావ్యమైన – మధురమైన

రాట్నధ్వనిలో ప్రతిధ్వనించుచున్నది. రాట్నముయొక్క ఇంతటి విశాలమైన సందేశమును ప్రజలకు వినిపించుట, నాకును చరఖా సంఘమునకును విద్యుక్త కర్తవ్యమైయున్నది. కాని నేటివరకును ఖాదీప్రవృత్తి నడచుచున్న విధమే యికముందును సాగిపోవుచో ఖద్దరు ఒక వ్యాపకవస్తువు కాజాలదు. ఈ విషయము ఈ పర్యటనములో నాకు విస్పష్టమైనది. ఈ సందేశమును బోధించుటయు, దానికి సజీవరూపము నిచ్చుటయును గ్రామసేవకుని ప్రధానకార్యమై యున్నది.

గ్రామసేవకుడు గ్రామమునకు వెళ్ళి స్వయముగా నియమపూర్వకముగా కదురాడించును. కేవలము దారముతీయుటయే గాక తన జీవనోపాధికై పార, పలుగు, సమ్మెట, బాడిత మొదలైన పనికరములతోను కరచరణాది అవయవములతోను కూలి లభించు పనిచేయును. తినుట నిద్రించుట మొదలగు నిత్యకృత్యములకై ఎనిమిదిగంటలు పోను, మిగిలిన కాలమంతయు ఏదో యొకపనిలో వినియోగించును. ఒక నిముసమైనను వృథాపోనీయడు. సోమరిపోతులను తనయొద్దగాని యితరుల యొద్దగాని బాతాఖానీ వేయనీయడు. తాను యజ్ఞము చేయవలసియున్నదని వారితో చెప్పుచుండును. శారీరక పోషణము శారీరక పోషణమువలననే జరుగును. మానసిక పోషణకు మానసిక విద్య సంస్కృతి అవసరము. శారీరకకృషిలో శ్రమవిభాగము – వృత్తివిభజన – యుండవచ్చును గాని ఒకవర్గము శారీరక కృషిని, మరొకవర్గము మానసిక కృషిని చేయుచుండవలె నను పద్ధతి మంచిదిగాదు.

స్వాతంత్ర్యము మనదేశమునుండి సెలవుపుచ్చుకొనక పోయినచో ఎన్నో సౌకర్యములు లభించినను, ప్రజలు ఆకలి బాధతో నుండక తప్పదని యీ తొమ్మిదిమాసముల పర్యటనములో తెలిసికొంటిని. గుప్పెడు తినువాడు రెండు గుప్పిళ్ళు పండించవలెనను ధర్మమును స్వీకరింపవలెను. ఇది జరుగుచో తదితర కోట్లప్రజలు సుఖముగా జీవింపగలరు. లేనిచో జన సంఖ్య యెంత తక్కువైనను ఆకలిచావుల వర్గమొకటి ఉండియే తీరును. ఈ విధముగ గ్రామసేవాకార్యములో రసాస్వాదనము చేయు సేవకులు గ్రామములకు వెళ్ళుచున్నారనగా ఉపదేశకుల రూపముననే. కాని అచట వారు స్వయముగ నేర్చుకొను వారుగ నుందురు. నిత్యము నూతన పరిశోధనలు చేయుచుందురు. వారు పదునారుగంటలు ఖాదీవడుకుచు కూర్చుండవలయునని కాదు నా యభిప్రాయము. ఖాదీకి వినియోగింపగా మిగిలిన సమయములో, అతడు గ్రామమందు నడచుచున్న వృత్తులను, పనులను తెలిసికొనును. అం దభిరుచి కలిగించి కొనును. ప్రజల జీవనములో అతడు మునిగి తేలవలెను. రాట్నమందు విశ్వాసములేని ప్రజలు సహితము ఈ సేవకులను గుర్తించెదరు. సేవకుల జీవనమునుండి తమ కిష్టమైన విషయములను స్వీకరించెదరు. తమ శక్తికిమించిన కార్యములో గ్రామ సేవకుడు జోక్యము చేసికొనరాదు. సాధ్యముగాని పనులలో చేయిచేసికొనినచో సేవకులు అందు చిక్కుకొనవచ్చును సుమా! గ్రామపారిశుద్ధ్యము గ్రామసేవకుని ముఖ్యమైన రెండవపని. ఇతరులు ఎంతసేపు చూచినను తృప్తితీరనంత స్వచ్ఛముగను

సుందరముగను తానున్న గృహమును అట్టిపెట్టుకొనును. తన యింటి ముంగిలిని యెంత శుభ్రముగ నుంచుకొనునో యితరుల ముంగిలినికూడ అంత శుభ్రముగ చేయుచుండును.

గ్రామసేవకులు గ్రామమందు డాక్టరుగారి వృత్తి నవలంబించి కూర్చుండరాదు. హరిజన పర్యటనమందు ఒక గ్రామాశ్రమమును చూచు అవకాశము నాకు లభించెను. కాని నేనక్కడ చూచినదానివలన నామనస్సునకు చాల క్షోభకలిగెను. ఆశ్రమ వ్యవస్థాపకుని, కార్యకర్తలను ముక్కచివాట్లు పెట్టితిని. నే నిట్లంటిని "మహానుభావులార! చాలబాగున్నది. తమరు ఈ యాశ్రమమును చాల బాగుగ నిర్మించినారు. ఇచట ఘనమైన ఒకవిలాస భవనమును నిర్మించి కూర్చుండినారు. ఇది ఒక పెద్ద పోస్టాఫీసు బిల్డింగువలె నున్నది. తామిచట ఒక ఆస్పత్రినికూడ తెరచినారు. చుట్టుప్రక్కల గ్రామములలో తమ స్వయంసేవకులు ఇంటింట మందు లిచ్చుచుందురు. తమకొక కాంపౌండరుకూడ కలడనియు దూర దూర ప్రదేశములనుండి రోగులు వచ్చెదరనియు, నెలకు సగటున 1200 రోగులు వచ్చుచుందురనియు, తమరు గర్వముతో చెప్పుచున్నారు. ఎన్నడైనను ఏ యాశ్రమములోనైనను ఇట్టి ఘనమైన భవనమును ఆస్పత్రిని తమరు చూచితిరా? ఏమి! ఇట్టిభవనమును ఆస్పత్రిని కట్టవలెనన్న నాకు డబ్బులేకపోయెనా? ఇచటి ఆశ్రమ గృహములును మిక్కిలి ధనవ్యయముచేసి నిర్మించినారు. నాఆశ్రమమంతయు తమ యీ భవనముతోనే పోటీ చేయజాలకున్నది. ప్రజలకు మందు మాకు లిచ్చుపని మీది కాజాలదు. వారికి పరిశుభ్రతాపాఠమును నేర్పుటయే మీపని.

వారు స్వేచ్ఛాచారులై, మురికిగా నుండుచు, ఇండ్లను, గ్రామమును మురికిగా నుంచుకొనుచు జబ్బులు పడుచుండుట వారిపనియును, వారికి మందు మాకు లిచ్చుట మీపనియునా? ఇది గ్రామసేవకాదు. మీరు గ్రామస్థులకు సంయమము స్వచ్ఛత నేర్పవలెను. ఆరోగ్య సూత్రములను బోధింపవలెను. గ్రామస్థుల సేవయనగా — ఇది. నాసలహా మీరు పాటించుచో ఈ భవనములను వదలివేయుడు. ఎదుటనున్న కుటీరములలో ప్రవేశించుడు. ఈ భవనమును జిల్లాబోర్డువారికి అద్దెకిచ్చివేయుడు. వారినే యిచట వైద్యశాలను నడుపనిండు.'' చంపారనములో మాయొద్ద క్వినైను, అయోడిన్, ఆముదము మొదలైన నాలుగు మందులకు మించి ఇంకే యౌషధము ఉండెడిదికాదు. ఆరోగ్యము, పరిశుభ్రత ఈ విషయములే ప్రజల మనసులో గాఢముగ నాటుకొనునట్లు గ్రామసేవకులు చూడవలెను. నేటి గ్రామములస్థితి చాల అధ్వాన్నముగా నున్నది. ఎక్కడబట్టిన అక్కడ మూత్రము విడుచుచుందురు. ఉమ్మి వేయుచుందురు. పెంట వేయుచుందురు.

దీనితరువాత గ్రామసేవకుడు గ్రామ హరిజనులసేవ చేయవలసియున్నది. అతనియిల్లు హరిజనుల కెల్లప్పుడు తెరచియుండును. ఏదైన కష్టము కల్గినపుడు సహజముగా వారు అతనియింటికి పరుగెత్తుకొని వచ్చెదరు. గ్రామసేవకుని యింటికి హరిజనులు వచ్చుట గ్రామస్థులు ఇష్టపడకున్నను, లేక వారతనిని బహిష్కరించినను, అచట ఉండుటవలన హరిజనసేవకు ఆటంకములు కల్గుచున్నను, గ్రామసేవకుడు హరిజనవాడకు వెళ్ళి పాక వేసికొనవలెను.

# విద్యలో అక్షరజ్ఞానముయొక్క స్థానము

ఇక విద్యాసమస్య యున్నది. 1922 సం. లో "బాల బోధిని" వ్రాసితిని. దానిని నేను మరవలేదు. అందలి విషయమును నచ్చజెప్పజాలక పోయినను, ఆవిషయము నిప్పటికిని యథాపూర్వకముగ నున్నది. ఆపుస్తక మిపుడు దొరకునో లేదో తెలియదు. కాని, దొరకకపోయినచో వ్రాసి యివ్వగలను. చేతి కంటె ముందు బిడ్డలకు కన్ను, చెవి, నాలుక - ఇవి పనిచేయు ననుట వాస్తవము. అందుచే ఉపాధ్యాయుడు బిడ్డకు చరిత్ర, భూగోళము మొదలైనవి - ఏవి బోధించినను, మౌఖికముగ (నోటితో, వ్రాతలేకుండ) బోధించును. దీనితరువాత వర్ణమాలయు, గుణింతము, మాటలు వ్రాయుట, మొదలైనవి నేర్పును. దానిని పరిపూర్ణముగ నాచరించి పరిశోధనముచేసి చూడవలెను. బుద్ధినిరేపి చైతన్యవంతము చేయుటకు ఈ నా మార్గము అతి సులభమైనదని నాకు తోచుచున్నది. నాబాల్యానుభవము ఇప్పటికిని నాకు బాగుగనే గుర్తున్నది. నేను మహాభారతకథను వినుచున్నకాలమున అక్షరములు దిద్దుటకాబోలు నేర్చుకొనుచుంటిని. రామాయణకథ వినునాటికి ఒకటిరెండు పుస్తకములు చదివియుందును. అయినప్పటికిని మహాభారతకథను గాని, రామాయణ కథనుగాని అర్థముచేసికొనుటలో నా కెట్టి కష్టమును కల్గుచుండెడిది కాదు.

ప్రజలను మనము భ్రమజాలములో పడవేయరాదు. అక్షర జ్ఞానము లేకుండ ఏవిద్యయు సంపాదింపజాలమని మనము

చెప్పుచో వారు తప్పుత్రోవను పడుదురు. పెద్దలకు పిన్నలకు పుస్తకజ్ఞానము ఇయ్యవలెనన్నది నా గ్రామ సంఘటనములో ఉపస్థితమైయున్నది. కాని అక్షరాస్యతకు నేను విరోధినని మాత్రము దీనియర్థముకాదు. నేనాక్షరజ్ఞానముయొక్క సదుపయోగము కోరువాడను.

గ్రామసేవకుడు సాహిత్యక జీవనమును, జ్ఞానవిలాస జీవనమును గడుపుచో గ్రామస్థులకు అసలు విద్యను, జ్ఞానమును ఈయజాలడు. అతనియొద్ద సమ్మెట, బాడిత, గొడ్డలి మొదలైన పనిముట్లుండును. పుస్తకములు బహుస్వల్పముగనుండును. గ్రంథపఠనమునకు సాధ్యమైనంత తక్కువ సమయమును వినియోగించును. ప్రజలాతనిని కలసికొనుటకువచ్చినపుడు అతడు బడాబడా గ్రంథములు తిరుగవేయుచు కానరాడు. ఏవ్రడంగపు పనిముట్లో ఆడించుచు ఆతడు కనిపించును. తాను తినుదానికి రెట్టింపు ఉత్పత్తి చేయగల శక్తిని భగవంతుడు ప్రతిమనుష్యునకు ఇచ్చియున్నాడు. దుర్బలురలో దుర్బలుడైన మానవుడుగూడ యీపాటి ఉత్పత్తి చేయగలడు. దీనికొరకతడు తన బుద్ధిబలము నుపయోగించును. "నేను మీసేవ చేయవచ్చినాను; ఈ పొట్టకు పిడికెడు మెతుకులు పెట్టుడు" అని అతడడుగును. లోకులు కొందరతనిని నిరాకరింపవచ్చును; అయినను అతనిని తమ గ్రామమున నిల్వ నిచ్చెదరు. ఎవరో సతానులు కొందరు అతనికి భోజనము పెట్టక పోయినను, హరిజన సోదరులు మాత్రము తప్పక పెట్టెదరు. అతడు సర్వసంగ పరిత్యాగము చేసియుండుచో హరిజనుల యింటనుండి భోజనము తీసికొను

టకు లజ్జపడవలసిన అవసరములేదు. అతనికి భోజనము దొరు కుచు తయారుచేసిన వస్తువులను అమ్ముకొను జంజాటములో పడరాదు. కాని ప్రజల సహకారము లభింపనిచోట తానేదైన కృషి నవలంబించి పొట్టబోసికొనవచ్చును. ఆరంభమందు మాత్రము ఏ సామాజిక సంస్థనుండియో తక్కువ డబ్బు పుచ్చుకొని పొట్టగడుపుకొన వచ్చును.

## గోసంరక్షణ

గోసంరక్షణ సమస్యను నేను ఇచట బుద్ధి పూర్వకము గనే విడిచిపెట్టితిని. ఇదియొక గొప్ప విస్తృతసమస్య. ఇంతవర కును చర్మమును ఊనుట, రంగువేయుట పరిష్కరింప జాల కున్నాము. గోవును పునరుద్ధరించు విధము ఇప్పుడే తోచు చున్నది. కాని దీనికి సంబంధించిన ప్రణాళిక ఒకదానిని స్థిర పరచుట ఇంకను ఎక్కువ స్పష్టముగా ఆకళింపునకు రాలేదు. గేదెలను ప్రోత్సహించుట ఒకవిధముగ ఆవులను నాశనము చేయుటయే. ఈ చర్చను ఇంకొకసారి తెచ్చెదను.

## ఆత్మబలమే ముఖ్యబలము

మన శస్త్రాస్త్రములన్నియు అధ్యాత్మికములను మాట గుర్తుంచుకొనుడు. ఒక పర్యాయము మనకు ఆత్మశక్తి లభిం చినచో మరి దానిని ఎవరు ఆటంక పరుపజాలరు. ఇది నేను నా యిరువది సంవత్సరముల అనుభవపూర్వక విశ్వాసముతో చెప్పుచున్నాను. ఈ అధ్యాత్మికశక్తి తోలుకన్నులకు ప్రత్యక్ష ముగ కనబడునట్టి ఒకస్థూల పదార్థముకాదు. అయినను

యిది నాకు ఎట్టయెదుట కనబడు వస్తువువలెనే కానవచ్చు చున్నది.

ఈ గ్రామసేవా కార్యక్రమము మావలన పూర్తి కాజాలదనియు, మాలో యోగ్యతలేని కారణమున అది అసాధ్యమనియు మీరు చెప్పరాదు. నేను చెప్పునదేమనగా గ్రామసేవా విషయము నిస్సందేహముగ మీ మనస్సునకు నచ్చినచో మీరందరును ఈ కార్యక్రమమును నిర్విఘ్న ముగ నెరవేర్చగలరు. మీరు అయోగ్యులుకారు. బుద్ధికి గ్రాహ్యమైన విషయమును అమలు జరుపజాలనందుకు గాబరా చెందుటగాని నిరాశులగుటకాని పనికిరాదు. ఆచరించి చూచు టకు లజ్జయేల? మనము గ్రామమునందుండి దీనిని అమలు జరుపవలెను. అమలు చేయగా చేయగా మాత్రమే అనుభ వము లభించును. (హరిజన సేవక్ 7-9-1934)

# 10. వీరభూమికిచెందిన వినమ్రగ్రామస్థుడు

శాంతినికేతనములో నివసించుచున్న ఒక వినీతగ్రామీ ణుడు దీనబంధు ఆండ్రూసు ద్వారా నాకు ఈ క్రింది ప్రశ్నలను పంపినాడు.

1. "మీ యభిప్రాయములో ఆదర్శన భారతీయగ్రామ మెట్లుండును? భారతదేశమున నేటి సామాజిక రాజకీయ స్థితు లలో ఒక గ్రామమును ఎంతవరకు ఆదర్శప్రాయముగను, యథార్థముగను పునర్నిర్మాణము చేయగలము.

2. గ్రామమందలి ఏ సమస్యలను మొట్టమొదట పరిష్క రించుటకు యత్నింపవలెను ? ఆ ప్రయత్నములను ఏవిధముగా నారంభింపవలెను ?

3. కొద్ది కాలముపై గ్రామీణప్రదర్శనశాలలు, సంగ్రహాలయములు ఏర్పాటు చేయబడుచో అందే యే విషయము లుండవలెను ? పునర్నిర్మాణములో ఈ ప్రదర్శనములు మిక్కిలి యుపకరించు టెట్లు ? ”

1. ఆదర్శభారతీయ గ్రామము సంపూర్ణమైన ఆరోగ్యము కలదిగ నిర్మింపవలెను. అందలి గుడిసెలు, గృహములు ధారాళముగా వెలుతురు కలిగియుండునటుల నిర్మింపవలెను. సుమారు ఐదుమైళ్లు దూరములోగా లభించువస్తువులతోనే గ్రామమును నిర్మింపవలెను. పశువులశాలకును, చెట్లపాదులకును తగినంత ప్రదేశము ఖాళీ వదలిపెట్టవలెను. సాధ్యమైనంతవరకు గ్రామవీధులందును, రాస్తాలపైనను, ధూళి యుండరాదు. అవసరముకొలది బావులుండవలెను. ఆ బావులు అందరికిని ప్రవేశముండవలెను. ఎల్లరకు ఒక ప్రార్థనాశాలయు, ఒక మందిరమును ఉండవలయును. పదిమంది కూడుటకై ఒక సమావేశ భవనమును ఉండవలయును. ప్రతి గ్రామమునకు ఒక పశువులబీడును, సహకారపద్ధతిపై ఒక గోశాలయును, వృత్తి విద్య ప్రధానముగాగల ప్రాథమిక మాధ్యమిక పాఠశాలలు ఉండవలెను. గ్రామ తగాయిదాలను, ప్రజల వ్యవహారములను పరిష్కరించుటకు ఒక పంచాయితీయును ఉండవలెను. అవసరమునకు తగినమేరకు ధాన్యము, కూరగాయలు, పండ్లు,

ఫలములు, ఖద్దరు మొదలైనవి ఆ గ్రామమందే తయారు కావలెను. ఇది ఆదర్శగ్రామమును గూర్చిన నాయూహా. ప్రస్తుత పరిస్థితులలో అచటియిండ్లు యధాపూర్వకముగనే యుండును. అచటచట యేదో కొంత బాగుచేసిన చాలును. గ్రామమున ఒకవేళ జమీందారుండి అతడు మంచివాడైన యెడలను, లేక గ్రామస్థులలో సహకారభావము, ప్రేమ భావము ఉన్నను ప్రభుత్వసహాయము లేకయే గ్రామస్థులే (జమీందారుతో సహా) స్వాయముగ తమపై తామాధారపడి దాదాపుగా ఈ చెప్పిన పనులన్నిటిని సరిజేసికొనవచ్చును. ఇండ్లను మొదలెత్తి క్రొత్తగా కట్టుటమాత్రము పెట్టుకొన రాదు. ప్రభుత్వము సహాయము లభించుచో గ్రామములను అంతులేకుండ పునర్నిర్మాణము చేయవచ్చును. కాని గ్రామ స్థులే తమ కాళ్ళపై నిలబడి పరస్పర సహకారముతో గ్రామ సమిష్టిమేలుకొఱకు శ్రమపడినచో వారెంతపనియైనను చేయగలరని నేను తలచుచున్నాను. గ్రామస్థులకు ఉచిత సలహా యును, మార్గదర్శకుడును లభించినచో గ్రామాదాయము ఖచ్చితముగా రెట్టింపు కాగలదని నా నిశ్చితాభిప్రాయము. వ్యాపారదృష్టితో ఉపయోగించుకొనదగిన అగణ్య సాధన సామగ్రి గ్రామమున లేకపోవచ్చును. కాని, స్థానిక ఉపయో గము కొఱకును, లాభముకొఱకును, అవసరమగు సాధనములు దాదాపు అన్నిగ్రామము లందును కలవు. కాని ఘోరదుర దృష్ట మేమనగా గ్రామస్థులు తమస్థితిని చక్కబరచుకొనుటకై స్వాయముగా కొంచెమైనను శ్రమజేయుటకు యిష్టపడరు.

(2) గ్రామసేవకుడు మొట్టమొదట గ్రామ పారిశుద్ధ్య మందును గ్రామ ఆరోగ్యమునందును చేయిచేసికొనవలెను. గ్రామసేవకులకు యేమిచేయుదమా అని అనిపించు సమస్యలనేకములు ఉండనేయున్నవి. కాని పారిశుద్ధ్య ఆరోగ్య విషయములు అన్నిటికంటెను నిర్లక్ష్యము చేయబడుచున్నవి. తత్ఫలితముగా గ్రామారోగ్యము నానాటికి క్షీణించిపోవుచున్నది. వ్యాధులు వ్యాపించుచున్నవి. గ్రామ సేవకుడు తన యిష్ట పూర్తిగా పాకీవాడుగ తయారగుచో, అతడు ప్రతిదినము పెంటను ప్రోగుచేసి దానిని ఎరువుచేయగలడు. గ్రామరాస్తాలను శుభ్రముగా ఊడ్వగలడు. అతడు జనులకు మలమూత్రములను ఎచట విసర్జింపవలసినదియు, పరిశుభ్రత నెట్లు కాపాడుకొనవలసినదియు, దానివలన కల్గు లాభములను, అశ్రద్ధచేయుటవలన గల్గు నష్టములును, -వీనినిగూర్చి తెలియజేయును. గ్రామ జనులు అతనిమాటను చెవినిపెట్టినను, పెట్టకున్నను, అతడు మాత్రము తనపనిని తాను చేయుచు పోవలసినదే.

(3) సకలగ్రామీణ ప్రదర్శనములందును రాట్నమునకు అగ్రస్థాన మియ్యవలెను. దాని చుట్టును స్థానిక పరిస్థితికి లాభదాయకమైన ఇతరవృత్తులు చూడవలెను. దానికి తోడుగ ప్రత్యక్ష పరిశోధనములను, ఉపన్యాసములనుకూడ ఉంచుచో ఆ ప్రదర్శనము గ్రామస్థులకు నిస్సందేహముగా వస్తుపాఠము వలె ఉపయోగకరమును విద్యాప్రబోధకమును కాగలదు.

# 11. ఒక గ్రామసేవకుని ప్రశ్నలు

ఒక గ్రామసేవకు డీవిధముగా వ్రాయుచున్నాడు.

(1) "సుమారు నూరుమంది జనాభాగల ఒకచిన్న పల్లెలో నేను పనిచేయుచున్నాను. మందులిచ్చుటకుముందు గ్రామసేవకుడు పారిశుద్ధ్యముపై శ్రద్ధవహింపవలెనని మీరు చెప్పుచుందురు. కాని జ్వరగ్రస్తుడైన ఒక గ్రామరోగి సహాయ మపేక్షించి దగ్గరకు వచ్చినపుడు గ్రామసేవకుని కర్తవ్య మేమి? నేనింతవరకు నిచ్చటనే లభించు వ్రేళ్ళను ఆకులను ఉపయోగింప వలసినదిగ సలహా నిచ్చుచున్నాను.

2. వర్షాకాలములో కశ్మలమును ఏమిచేయవలెను?

3. కశ్మలము (చెత్త, చెదారము) అన్నిపంటల కుప యోగించునా?

4. చక్కెరకు బదులుగా బెల్లమును వాడుటవలన ఉప యోగమేమి?

జ్వరము, అజీర్ణము మొదలైన సామాన్య రోగపీడితులు సాహాయ్యమునకై గ్రామసేవకుని యొద్దకు వచ్చినపుడు అతడు యథాశక్తిగ వారికి తోడ్పడ వలసినదే. ముందు రోగమును కనుగొనవలెనే గాని, చోకలోచోకయు, నాణెములో నాణెము వగు మందుమాత్రము ఆగ్రామమందే దొరకితీరును. ఎవరైనను తమయొద్ద ఔషధము లుంచుకొన దలచినచో, ఆముదము, క్వైనైను, మసలకాగిన వేడినీరు-ఇవి అత్యుత్తమమైన మందులు. ఆముదము అన్నితావులందును లభించును. సునాముఖి ఆకు

కూడ దానివలెనే ఉపయోగించును. క్వైనైనును నేనెక్కువగా వాడను. అన్ని విధముల జ్వరములకు అది పనిచేయదు. జ్వరములలో చాలభాగము అర్ధోపవాసము వలనను, లేక పూర్ణోపవాసము వలనను నిర్మూలించును. అన్నము, పాలు విడిచి పండ్ల రసమును ఉడికించిన ద్రాక్షనీరును, నిమ్మపండ్ల రసమును చింతపండు కలిపి ఉడికించిన బెల్లపు నీరును, తీసుకొనవచ్చును. దీనికే అర్ధోపవాస మందురు. ఉడికించిననీరు రామబాణము వంటిది. అది క్రేవులను కడిగివేయును. చెమట పట్టించును. అంతటితో జ్వరతీవ్రత తగ్గును. ఇది రోగాణునాశక ఔషధము. దీనివలన యెట్టి అనిష్టము కలుగదు. వెలయందు మాత్రము గ్రుడ్డిగవ్వతో పనిలేకుండ కావలసినంత దొరకును. ఏపరిస్థితులలోనైనను నీరు త్రాగవలసి వచ్చుచో దానిని కొంచెము చల్లార్చి త్రాగవచ్చును. హాయిగా పట్టగలిగినంత వేడినే త్రాగవలెను. వేడినీరు అనగా కేవలము నీటిని వెచ్చబెట్టుటకాదు. నీరు తుకతుక లాడవలెను. ఆవిరి రావలెను. అప్పుడు నీరు మసిలినదని యెంచవలెను. వ్యాధులం దుపయోగింపదగిన వేడినీరు అదియే.

తాను స్వయముగా ఒక నిశ్చయమునకు రాజాలనపుడు గ్రామసేవకుడు స్థానికముగనున్న వైద్యుని సహకారమును, సలహాను తప్పక పూర్తిగా తీసుకొనవలెను. వైద్యులుగాని విశ్వసనీయులుగాని లేనితావులందు తానెరిగిన పొరుగూరి వైద్యుని పరోపకారియగు వైద్యుని సహాయము పొందవలెను.

కాని, వ్యాధి ఉపచారమందు సహితము పరిశుభ్రతకు స్థానమెక్కువ గలదని గ్రామసేవకుడు తెలిసికొనవలెను. ఒక్క ప్రకృతియే సర్వోత్తముడైన వైద్యుడని జ్ఞప్తియందుంచుకొనవలెను. మనుష్యునిలోని దోషమును ప్రకృతి సర్దుబాటు చేయుచుండునని తెలిసికొనవలెను. మనుష్యుడు నిత్యము బొత్తిగా నిర్లక్ష్యముతో ప్రకృతిని అవహేళన చేసినపుడు మాత్రమే ప్రకృతి వివశయగుచున్నది. అట్టియెడ ఏవరిని సరిజేయుట అసాధ్యమైపోవునో అట్టివారి నిలయము జేయుటకై ప్రకృతి, తన అంతిమ దూతయు అసాధ్యుడునగు మృత్యువును పంపుచున్నది. మరియు దేహికి నూతనదేహమును ప్రసాదించుచున్నది. పరిశుభ్రత, ఆరోగ్యము - వీనికై కృషిచేయువారు ఉత్తమోత్తను చికిత్సకుడైన ప్రకృతికి అధికాధికముగ తోడ్పడినవారగుచున్నారు. వారికిది తెలియవచ్చును, లేక తెలియకపోవచ్చును. అది వేరేవిషయము.

(2) వర్షాకాలమందును మనుష్యులకు రాకపోకలకు మార్గముకాని ప్రదేశమునకు బైలుకు వెళ్లవలెను. మలమును అచట పూడ్చవలెను. కాని సాంప్రదాయికముగ వారికి లభించిన మిథ్యాజ్ఞాన కారణముగ వారీపనిని చేయరు. ఇదియొక చిక్కు సమస్య. సిందీ గ్రామములో (వార్ధాదగ్గర) గ్రామస్థులు రోడ్ల ప్రక్కన బైలుకు కూర్చుండుట మాన్పి, దగ్గర పొలములకు వెళ్లునట్లు అలవర్చుటకును, తమ మలముపై తాము మట్టిని కప్పునట్లును చేయుటకు మేము చాలాప్రయత్నించుచున్నాము. రెండు మాసముల నిరంతర పరిశ్రమ మూలముననూ,

మ్యునిసిపల్ సభ్యులయు, తదితర ప్రజలయు సహకారమువల నను, ఆ గ్రామస్థు లిపుడు రోడ్లను పాడుచేయుట సాధారణ ముగా మానివేసిరి. ఇంతవట్టుకు మార్పువచ్చినది. కాని, యెన్ని చెప్పినను తమ మలమూత్రములను మట్టితో కప్పుటమాత్రము సున్న. "ఏమయ్యా" అని అడిగినచో "ఇదియంతయు పాకీ వానిపని. మలమును చూచుటయే పాపము. పైగా దానిపైన మట్టిపోయుటకూడనా? ఘోరపాతకము." అని జవాబిచ్చుచుం దురు. వారికి లభించిన విద్యయే సాంప్రదాయక జ్ఞానమే యిట్టిది. ఇట్టి విచిత్రనమ్మకము ఆ సాంప్రదాయిక విద్యాఫలి తమే. కనుక గ్రామసేవకుడు గ్రామస్థుల హృదయములందు నూతన సంస్కారములు వేయుటకు ముందు సాంప్రదాయ సిద్ధమైన యీ కుసంస్కారములను ఒక్కపెట్టున కూకటివ్రే ళ్లతో పెరికివేయవలసియుండును. మనకు మన కార్యక్రమ మందు దృఢవిశ్వాసమున్నను, నిత్యము ప్రాతఃకాలమున వీధు లూడ్చు కార్యముపట్ల మన ఆంతర్యములో ధైర్యమున్నను, గ్రామవాసుల యీ కుసంస్కారములపట్ల మనము చిరాకు చెందకుండ యున్నను, గ్రామస్థుల యీ మిథ్యావిశ్వాసము లన్నియు సూర్యోదయమునందు పొగమంచువలె మటుమాయమై పోవును. కాని యుగములతరబడి పాతుకొనియున్న వజ్రసం ఘాతమైన వారి అజ్ఞానము యీ నాల్గుమాసముల పదార్థ పారమువలన నిర్మూలనము కాజాలదు.

సిందీ గ్రామములో వర్ష ఋతువునుకూడ ఎదుర్కొన సంసిద్ధులగుచున్నాము. రైతులే తమ పైరువంటలకు కావలి

కాయుచుందురు. అట్టి సమయమున వర్షాకాలమందును జనులను పొలములలో మలవిసర్జన చేయనిత్తురా? అందుచే ప్రజలతో సంప్రతించి నేనొక నిర్ణయము – బందోబస్తు చేసితిని. చేను హద్దునకు లోపలనే కొంతభూమి పూర్తిగా వేరుచేసి మరుగు చేసికొనవలెను. ఆ కంచెలోపలనే మలవిసర్జనము చేయవలెను అని. వర్షాకాలము వెళ్ళుటకు ఈ నేలలో తగినంత యెరువు తయారగును. తమ చేలలోవచ్చి 'బైలుకు' కూర్చుండుడని చేను గ్రామందే జనులను పిలుచు సుదినములు సమీపించుచున్నవి. నాగా లేకుండ సంవత్సరము పొడుగున మలవిసర్జన చేసినచో భూమియజమానికి రెండు రూపాయల యెరువు ఇచ్చినట్లగును అని డా॥ ఫౌలరు యొక్క అంచనా. కచ్చితముగా రెండురూపాయల యెరువే లభించునో, అంతకంటె ఎక్కువ లేక తక్కువ లభించునో అది చర్చనీయాంశము. కాని ఒక్కటి మాత్రము నిస్సంశయము. అదేమనగా — మల మూత్రములు తగులుటవలన భూమికి తప్పక బలము చేకూరును.

మలము ఆమట్టుననే – యథాతథాగా అన్ని పైరులకు ఎరువు కాగలదని ఎవరును చెప్పియుండలేరు. ఒక నియమిత సమయమునకు పిమ్మట మాత్రమే ఆ మలము మట్టితో కలిసి చక్కని ఎరువగును. మలము పూడ్చబడుటతోడనే అది అనేక ప్రక్రియలకుండ దాటిపోవును. అప్పుడుగాని ఆ భూమి దున్నుటకును, విత్తుటకును, అన్నిటికిని ఉపయుక్తమగును. దీనికి తిరుగులేని ఒరపిడిరాయి ఇది. మలము పూడ్చబడిన స్థలమును నియమిత కాలమైన పిమ్మట త్రవ్వగా మట్టినుండి ఎట్టి దుర్గంధము

రానిచో, మలము నామరూపము లేకుండ పోయినచో, అది యెరువుగ మారిన దనియు, భూమి సేద్యమునకు తగియున్న దనియు గ్రహింపవలయును. అప్పుడు విత్తనములు చల్లవచ్చును. గత మూడు సంవత్సరములు నేనీ విధముగా పెంటయెరువును అన్ని విధములైన పంటలకును ఉపయోగించితిని. మరి దీని మూలమున అధికాధిక లాభమే కలిగినది.

చక్కెరకంటె బెల్లము పుష్టికరమని విశేషజ్ఞులందరును ఏకగ్రీవముగ అంగీకరించుచున్నారు. ఎందుచేతననగా బెల్లమం దున్నట్టి లవణములు, విటమినులు చక్కెరయందు లేవు. మర పట్టిన పిండికంటె చేతితో విసిరిన పిండివలెను, పాలిష్ బియ్యము కంటె దంచిన ముడిబియ్యము వలెను చక్కెరకంటె బెల్లమే శ్రేష్ఠము.

## 12. భయ భావము

గ్రామసేవకు లనేకులు తమపొట్ట గడచుటకు గ్రామస్థు లేమి సాయము చేయగలరు అని భయపడుచుందురు. ఒక సంస్థనుండియో ఒక వ్యక్తినుండియో జీవనభృతి లభింపనిచో తాము కష్టముచేసి పొట్టపోసికొన జాలమని వారి కమిత భయము. వారు వివాహితులైయుండి కుటుంబభారము కూడ పైనబడియున్నచో ఇక వారి చింతకు మేరయే లేదు. కాని నా యభిప్రాయములో వారి యీ భావము సరికాదు. అయితే ఎవరైనను పట్టణ చిత్తవృత్తితో పల్లెలకు దయచేసి అచట పట్టణ జీవయాత్ర సాగింప వేడుకపడినచో అట్టివారికిమాత్రము

అచట కావలసినంత సంపాదన దొరకనిమాట నిశ్చయమే. పల్లెటూరివారిని పట్టణవాసులు దోచుకొనురీతిగ దోచినప్పుడు మాత్రమే వారికచట అధికాదాయము లభింపగలదు. కాని ఎవరైనను గ్రామములకు వెళ్ళి గ్రామస్థులవలె జీవింప ప్రయత్నించినచో వారి కృషివలన తగినంత భృతి వారికి లభించుటలో కష్టమేమియు నుండదు. తమ తాతముత్తాతల కాలమునుండి వచ్చుచున్న పాతపురాణ పంథాలను బుద్ధినేమియు ఖర్చుపెట్టక మూడువందల అరువదిదినములు కనులుమూసికొని పోవుచుండు రైతులే తమ జీవనమును నిర్వహించుకొనుచుండగా గ్రామసేవకులకేల యీ భయము ! గ్రామసేవకులకు ఈ మాత్రము ఆత్మవిశ్వాస ముండవలెను. వారు సగటున కనీసము రైతులు సంపాదించినంత యైన సంపాదింపగలరు. వీరిటుల సంపాదింప మొదలిడినను గ్రామస్థుల దినబత్తెమునకేమియు హానికలుగదు. ఎట్లనగా సేవకులు ఉత్పాదకులై – ఉత్పత్తి చేయువారై – గ్రామములకు వెళ్ళుదురు కాని పరాన్నభుక్కులై కాదు.

గ్రామమునకు వెళ్లు గ్రామసేవకుడు తన పరివారముతో కూడ వెళ్ళుచో అతనిభార్య, తదితరులు, అందరు కష్టించి పని చేసికొనవలెను. అయితే గ్రామమునకు వెళ్ళుటతోడనే వారు గ్రామస్థులవలె కఠినపరిశ్రమ చేయవలెనని చెప్పజాలము. కాని వారు సంకోచమును, భయమును విడిచిపెట్టి, శ్రమచేయలేని లోటును బుద్ధిబలసహిత కార్యములు చేయుటద్వారా భర్తీచేసి కొనవలెను. దినమంతయు గ్రామసేవలోనే గడుపుడు అన్నంత ఆదరము గ్రామస్థులనుండి లభించువరకు వారు ప్రేరేపించిన

సహాయములవలన పొందిన అధికపంటలో కొంతభాగము తీసి కొనుటకు వారు ఇష్టులగుదురు. గ్రామసేవకుడు గ్రామస్థులలో నిదానముగాను క్రమక్రమముగాను గాని జొరబడజాలడనియు, కాయకష్టము సత్ప్రవర్తనలదృష్ట్యా ఆదర్శప్రాయమైన నడవడిని సంపాదించుకొనవలె ననియు, గ్రామోద్యోగ సంఘయాజమాన్యమున ఆరంభమైన గ్రామసేవయొక్క కొన్నిమాసముల అనుభవము తెలుపుచున్నది. దీనివలన గ్రామస్థులకు చక్కని సేవ లభించును, గ్రామసేవకుడు గ్రామస్థుల సంరక్షకుడుగ తయారయి వారిచే పాదపూజ చేయించుకొనుటకు బదులుగా వారిలో ఒకడై వారిమధ్య కలసిమెలసి తిరుగుచు ఉండుచో అత్యల్పకాలములోనే అతని ప్రభావము, తేజస్సు గ్రామముపై పడకుండ నుండజాలదు.

ఇప్పుడు అతడు జీవనోపాధికై ఎటువంటిపని చేయవలెను అన్నది ఒకసమస్య. అతడును అతని కుటుంబములోని వారును కొంత సమయము గ్రామపారిశుధ్యమునకై వినియోగింప వలసి యుండును. గ్రామస్థులీకార్యమున సాయపడినను సాయపడ కున్నను వారు సేవచేయుచుండ వలసినదే. సాధారణమైన మందు మాకుల సాహాయ్యము గ్రామసేవకులు చేయుచుండవచ్చును. క్వినైను లేక యిటువంటి మామూలు ఔషధములను తెలియపర చుట, గాయమును పుండ్లను కడిగి శుభ్రము చేసికొనుట, చెవులు ముక్కులుకడిగి శుభ్రపరచుకొనుట, గాయములపై పాలాస్త్రీపట్టి వేసికొనుట—ఇట్టిపనులను అతడు తెలుపవచ్చును. గ్రామములో సాధారణముగా వచ్చుచుండు వ్యాధులకు అతి సులభమైన

చికిత్సామార్గములును, ఆరోగ్యోపదేశములును గల పుస్తకములకై వెదకుచున్నాము. ఎందుచేతననగా ఈ రెండు విషయములు గ్రామసేవకు మూలకందములై యున్నవి. కాని గ్రామసేవకుడు వీనికై దినమునకు రెండుగంటలకంటె ఎక్కువకాలము వినియోగింపరాడు. గ్రామసేవకునకు ఎనిమిదిగంటల పనిదినము ఒక గొప్పకాదు. గ్రామస్థులకు నాతడుచేయుసేవ ప్రేమమూలక శ్రమయైయున్నది. కనుక ఆతడు తన జీవనమునకు ఈ రెండు గంటలు కాక కనీసము మరియెనిమిది గంటలు పనిచేయవలసి యుండును. చరఖాసంఘ, గ్రామోద్యోగసంఘములు తయారు చేసిన నూతన ప్రణాళిక ననుసరించి అన్నివిధములైన శ్రమలకు కనీసపు వేతన మొకటిగానె - సమానమే. నేతగాడు, నూలు వడుకువాడు, కాగితములు చేయువాడు ఒకగంటలో ఒకేకూలిని సంపాదింతురు. గంటకు వారెంత కనీసపుకూలి సంపాదింతురో కమానమీాద పనిచేయు దూదేకువాడును అంతసంపాదించును. కనుక గ్రామసేవకుడు తాను సులభముగ చేయుగల దేనినైనను ఎన్నుకొనవచ్చును. కాని ఒక్క విషయము మాత్రము జ్ఞాపకముంచుకొనవలయును. ఆ గ్రామసేవకుడుచేయు శ్రమ ఫలితము ఆ గ్రామమునకుగాని, యిరుగుపొరుగు గ్రామములకు గాని ఉపయోగకరమైనదిగ ఉండవలెను. అతడు ఉత్పత్తిచేయు సరుకు ఆ గ్రామమునగాని చుట్టుప్రక్కల గ్రామములందు గాని ఖర్చుపడునట్టిదై యుండవలెను.

ప్రతి గ్రామమునను పరిశుద్ధమైన తినుబండారములు, కాయకూరలు చౌకగ లభించునట్టి దుకాణము లుండవలెను.

దుకాణమెంత చిన్నదైనను పెట్టుబడి అవసరమనుటయు యథార్థమే. కాని గ్రామసేవకుని పరిచిత ప్రదేశములందు ఆతని నమ్మకమును విశ్వసించి గ్రామస్థులు అతనికి కొంత సొమ్ము సరుకును అప్పుగా ఇచ్చుటకు సిద్ధపడెదరు.

ఇంకను ఇట్టి యుదాహరణము లియ్య నవసరములేదు. నిత్యము పరిశీలనాదృష్టితో పనిచేయు సేవకునకు నిత్య నూతన విషయములు గోచరించుచుండును. తనకు జరుగుబాటు నిచ్చుట కొరకును తాను సేవింపవలసిన గ్రామస్థులకు ఆదర్శప్రాయు డగుటకొరకును తానేపని చేయవలసినదియు అనతికాలములోనే అతనికి తోచుచునేయుండును. కనుక గ్రామసేవకులను పీడింప నట్టియు, వారి యారోగ్యమునకును, నీతికిని హాని కలుగనట్టియు వృత్తిని ఎన్నుకొనవలసి యుండును. కాని తీరిక సమయములలో చదువు సంధ్యలపని నేదైనను చేయుటమూలమున ఆదాయము వృద్ధియగునట్టి విద్యను అతడు నేర్చియుండవలెను. నిరంతరము పరిశీలించుచుండుచో గ్రామములందు అకారణముగ పాడగు చున్న పదార్థములను – విషయములను అతడు గుర్తించును. ఉదాహరణకు పొలమందు పైరుతోబాటు పెరిగివచ్చుచుండు గడ్డి గాదమును, తమకుతామే పుట్టిపెరుగు ఇతర మొక్కలు ఇంకను ఇట్టివి, వానిలో అనేకములు మిక్కిలి యుపయోగ కరములని స్వల్పకాలములోనే అతనికి తెలియును. వానిలో తినుటకుగాని మరియొకతీరున నుపయోగించుటకుగాని పనికి వచ్చునట్టి మొక్కలను తీసికొని సద్వినియోగము చేసినచో కాలి ముట్టినట్లే. మిక్కిలి యుపయోగకరములును, సుందరము లును, చూచుటకు చలువరాళ్ళవలె కనబడునవియు నగు

వివిధములగు రాళ్ళను మీరా సోదరి నాకు తెచ్చియిచ్చినది. నాకు తీరికయున్నచో శీఘ్రముగానే మామూలు పనిముట్లతో ఆ రాళ్ళను వివిధములైన రూపములుగ మార్చి అమ్మకము అగుటకు తగినట్లుగ తయారుచేసియుందును. పనికిరానివని పొయ్యిలో పెట్టబడుచున్న ఎండు వెదురుబద్దలను ఒక మామూలు చాకు సహాయముతో కాకా కాలేల్కరుగారు కాగితములనుకోయు చాకులుగాను, కొయ్య చెంచాలుగాను తయారుచేసినారు. వానిని కొంతవరకు బజారులలో కూడ అమ్మగలుగుచున్నాము. మగన్‌వాడీలో కొందరు జనులు ఒకప్రక్క వ్రాసిన చిత్తుకాగితములను కవరులుగచేయు పని నవలంబించి తమ తీరికసమయమును సదుపయోగము చేసికొనుచున్నారు.

అసలువిషయ మేమనగా గ్రామస్థులిపుడు పూర్తిగా నిరాశచెంది పోయినారు. క్రొత్తవారెవరైన వచ్చినపుడు వారు తమనెత్తిపై కెక్కుటకు వచ్చిరనియు, తమను పీల్చి పిప్పి చేసెదరనియు గ్రామస్థు లెంచుకొందురు. కాయకష్టమునకును, మానసిక శ్రమకును విడిపోవుటచేత వారి యాలోచనాశక్తి దెబ్బతినిపోయినది. పనిచేయు సమయమును సహితము ఉత్తమ రీతిగ వారు సద్వినియోగము చేసికొనుటలేదు. గ్రామసేవకులు ఇట్టి గ్రామములకు ప్రేమ, విశ్వాసము గల హృదయములతో వెళ్ళవలెను. వివేక విహీనముగా పనిచేయుచు రైతులు సంవత్స రములో అనేకమాసములు ఖాళీగా కూర్చుండుచోట తాము సంవత్సరమంతయు వివేకపూర్వకముగా పనిచేసినచో గ్రామస్థులకు విశ్వాసపాత్రులము కాగలమనియు, గ్రామస్థులమధ్య సబాయితీతో పనిచేయుచో తమ జరుగుబాటునకు అవసర

మైనంత సంపాదనము చేయగలమనియు గ్రామసేవకులకు ఆత్మ విశ్వాస ముండవలెను.

"కాని మాపిల్లల చదువుసంధ్యల మాటేమి" అని గ్రామ సేవయందు ప్రేమగల గ్రామసేవకులు ప్రశ్నించు చున్నారు. అయితే వారిబిడ్డలకు ఆధునిక విధానపు విద్యనే నేర్పవలసి యున్నచో వారికి నేను లాభకారి మాటేమియు చెప్పజాలను. గ్రామములో తమంతతాము సంపాదించుకొనగల ఆరోగ్యవంతు లును, దృఢకాయులును, విశ్వాస పాత్రులును, వివేకులు నగు గ్రామవాసులుగ తయారుచేయుటయే చాలుచో బిడ్డకు కావల సిన విద్యయంతయు మాతాపితల ఛత్రఛ్ఛాయయందే లభింపగలదు. మరియు బిడ్డలు పెరిగి పెద్దవారైన కొలదిని స్వతంత్ర ఆలో చనాశక్తి పెరుగుచున్న కొలదిని, పసిపాటలకు తమ కరచరణా ద్యవయవములు ఉపయోగించుట హెచ్చుచున్న కొలదిని తమ కుటుంబమునకు కొంచెమో గొప్పో సంపాదించి ఇయ్య నారం భింతురు. ఉత్తమ గృహమునకు సాటియగు పాఠశాల మరి యొకటిలేదు. నవ్యమైనను సదాచారమును గల తల్లిదండ్రుల వంటి యుపాధ్యాయులును లేరు. నేటి మాధ్యమికవిద్య గ్రామ స్థుల నెత్తిమీద నిరర్థక భారము. గ్రామస్థుల బిడ్డ లెన్నటికిని ఆ విద్యను గ్రహింపజాలరు. దైవానుగ్రహము వలన వారికి సుందరమైన నవ్యమైన గృహవిద్య లభించుచో వారెన్నటికిని నష్టపడరు. గ్రామసేవికా - సేవకులందరు సుందరత లేనిచో చక్కని గృహమును నిర్వహింపగలశక్తి లేనిచో వారు ఈగ్రామ సేవాసౌభాగ్య సమ్మానములను పొందవలెనను కోర్కెను పెట్టుకొనకొండుట మంచిది.

# సవరణ పత్రిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 13 | జనులకో | జనులలో |
| 10 | 5 | గ్రామగ్రామస్థలే | గ్రామస్థులే |
| 21 | 11 | అజ్ఞానప్రాప్తి | అజ్ఞానప్రాప్తికి |
| 30 | 20 | పాలకుడు | పాఠకుడు |
| 39 | 8 | లభించుచుండెను | లభించుచుండును. |
| 40 | 22 | ప్రజలకు | ప్రజలను |
| 46 | 15 | పిమ్మట | పిమ్మట మహాత్ముడు |
| 46 | 21 | చున్నాను | చున్నాను (మ. దేశాయి) |
| 48 | 22 | ఈ పద్ధతి | ఈ పద్ధతిని |
| 56 | 1-2 | దొరకుచు | దొరకుచో |
| 63 | 8 | అట్టివారి నిలయము | అట్టివారిని లయము |
| 64 | 21 | పారము | పాఠము |
| 65 | 21 | ఉపయుక్తమగును | ఉపయుక్తము కాదు |
| 67 | 3 | లభింపగలదు | లభింపదు |
| 71 | 16 | శ్రమకును | శ్రమకును సంబంధము |